Prescribed as Telugu Non-detail for S. S. L. C. Public Examination 1953.



# Asoka Vardhanudu



BY

SRI P. GANAPATI SASTRY, P. O. L.,

Sub-Editor "BHARATHI" Madras.






PUBLISHERS

**Rowthu Book Depot**

EDUCATIONAL PUBLISHERS

RAJAHMUNDRY.

1952

 ( Price Re. 0—15—0.

Prescribed as Nondetailed text for S. S. L. C.
Public Examination 1953.

---

# అశోకవర్ధనుఁడు

రచయిత:

శ్రీ పి. గణపతిశాస్త్రి, బి. ఓ. ఎల్.,

సహాయ సంపాదకులు "భారతి"



పబ్లిషర్సు:

రాతు బుక్కు డిపో,

విద్యావిషయిక ప్రచారకులు

రాజమహేంద్రవరము.

కాపీరైట్] 1952 [వెల రు. 0-15-0

# ప్రవేశిక

'అశోకవర్ధనుఁ' డను నీ చిన్నినవల అశోకుని కళింగ విజయ వృత్తాంతము కథాభాగముగాఁ దీసికొని రచించితిని. ఇది చాలవరకును చారిత్రికమైనదే. నవలారచనమున కనుగుణముగఁ గొన్నిచోట్లఁ గొన్ని సన్నివేశములును గొన్ని పాత్రలును మాత్రము కల్పితములు.

ఈ నవలారచనమునకు సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారును, శ్రీ భావరాజు వేంకట కృష్ణరావుగారును నాకనేకవిధముల సలహాలొసఁగి సాయపడిరి. వారికెంతయుఁ గృతజ్ఞుఁడను.

కేవలమును జరిత్ర పఠించుటకన్న నవలారూపమున నదియాకళించుకొనుటలో బాలుర మనోవికాసమున కెక్కుడుగఁ దోడ్పడునని భావించుచున్నాను. పాఠశాలావిద్యార్థుల యుపయోగ మెక్కువగ మనస్సున నుంచుకొని యిది రచించితిని.

పుస్తక రచనమునకుఁ బ్రోత్సహించి, రచన ముగియఁగనే శ్రీ 'రాతు' వారిది ప్రకటించుట కియ్యకొనిరి. వారికెంతేని కృతజ్ఞుఁడను.

పాఠశాలావిద్యార్థు లశోకవర్ధనుని కళింగవిజయ చరిత్ర రూపమగు నీ నవల నాదరముతోఁ బఠింపఁగలరని యూహించుచున్నాను.

చెన్నపురము,
౧౫-౮-౪౮.

పి. గణపతిశాస్త్రి.



# అశోకవర్ధనుఁడు



## ౧

"నాగావళీ ! నాగావళీ !"

నాగావళి మాఱుపలుకలేదు. ఆమె యేమైనదో యని చెలికత్తె లాశ్చర్యపడసాగిరి. ఆమె తమ్ము వేళాకోళము చేయుటకొఱ కెందైన దాఁగినదేమో యని వారందఱును నామెను వెదుకసాగిరి. వకుళాభరణ మాధవీలతామండప మంతయు వెదకినది. కనఁబడలేదు. మరల మహానదీసైకతము వైపునకుఁబోయి యచ్చటఁ బొదరిండ్లలో నెందైన దాఁగిన దేమో చూచినది. అక్కడఁగూడ లేదు. చివరకు వల్లకి దూరముననుండి "ఇదుగో! నాగావళి యిచ్చట దాఁగినది. రండు! రండు!" అని గట్టిగఁ గేక వేసెను. చెలికత్తె లందఱును నొకపెట్టున వల్లకి కేకవైచినచోటికిఁ బోయిరి.

అక్కడ నాగావళి యొంటరిగఁ గూర్చుండి వకుళపుష్పము లన్నియు నొక్కటొక్కటిగఁ దీసి యొక చక్కనిహారము గ్రుచ్చుచున్నది. ఆమె, చెలికత్తె లందఱును దనచుట్టును జేరి "అమ్మ! దొంగా! మమ్ములను విడిచి నీవిక్కడ నొంటరిగఁ గూర్చుండి దండ గ్రుచ్చుకొనుచున్నావా!" అని యనేకవిధము

లుగ మాటాడుచున్నను, చిఱునవ్వు నవ్వుచు నట్లే దండ గ్రుచ్చుకొనుచుండెను. ఆమె యెంతకును దమతోఁ గలిసి యల్లరి చేయకుండుట చూచి చెలికత్తె లామె ననేకవిధములఁ బరిహాసము లాడఁజొచ్చిరి. సుందర మందహాసముతోఁ గనురెప్పలు వాల్చకుండ నదేవిధముగ మాలిక గ్రుచ్చుచున్న యామెవైఖరి యెంతో మనోజ్ఞముగ నుండెను.

నాగావళి తోసలీనగరాధీశ్వరుఁడగు మహేంద్రకేసరి తనయ. మహేంద్రకేసరి మహానదీ తీరమున నున్న తోసలీ నగరము రాజధానిగ నొకచిన్న రాజ్యము పరిపాలించుచుండెను. మహేంద్రకేసరికి ముగ్గురు కుమార్తెలు. వారిలో నాగావళి పెద్ద. నాగావళికిప్పుడు సుమారు పదునెనిమిదేండ్ల వయస్సుండ వచ్చును. సన్నగ నాజూకుగ నున్న యామెయాకృతి 'నాగావళి' వలెనే యుండును. ఆమె కపోలములపై రత్నతాటంకములు తళతళ మెఱయుచుఁ, దెల్లని యామెచెక్కుల కొకవింతయందముఁ గలిగించుచుండెను. పాముకుబుసమువలెనున్న తెల్లనిచీరతో నామె నాగకన్యకవలె నుండెను.

చెలికత్తె లెన్నివిధములఁ బరిహాసము చేసినను నామె యట్లే మాలిక గ్రుచ్చుకొనుచుండెను. వకుళాభరణ, వల్లకియు నున్నవారిలో మిక్కిలి గడుసరులు. అందుచేత వారెట్లయినను నాగావళిచే దండగ్రుచ్చుట మాన్పించి, తమతో మహానదీ సైకతములపై నాడుకొనుటకుఁ దీసికొనిపోవలయునని నిశ్చయించి, తమలోఁ దా మివ్విధముగ మాట్లాడుకొనఁ జొచ్చిరి.

"నాగావళి యింతశ్రద్ధగ దండ యెందులకు గ్రుచ్చు కొనుచున్నదో తెలియునా!"

"తెలియదు"

"చెప్పెదనుగాని, నాగావళికిఁ గోపమువచ్చునేమో!"

"భయములేదులే! నే నున్నానులే"

"భయములేదనుచున్నావు! మధ్య నీకేమి! నాగావళి నన్ను కొట్టఁబోయినచో నీ వడ్డుకొనఁగలవా!"

"ఎందుకే నీకంతభయము! నీప్రాణములకు నాప్రాణము లడ్డువై చెదనులే చెప్పుము".

"నాగావళి తన ప్రాణేశ్వరున కర్పించుకొనుట్కై యీ వకుళమాలిక లల్లుకొనుచున్నది!"

ఈమాటలతో నాగావళి కపోలము లెఱ్ఱవడెను. అయి నను నామె సుందరనేత్రము లొకసారిపైకెత్తి యొక చిఱునవ్వు నవ్వుకొని మరల నట్లే తనపనిలో మునిఁగిపోయెను.

"ఎవరే ఆప్రాణేశ్వరుఁడు!"

"ఎవరితోను చెప్పకూడదుసుమా!"

"అబ్బ! చెప్పనులేవే!"

"అశోకవర్ధనచక్రవర్తి"

"కళింగమల్లమహారాజులుంగారి కిచ్చెద రన్నారుకాదే"

"నాగావళి చక్రవర్తిని పెండ్లియాడునుగాని, యితరు లను పెండ్లియాడునా!"

"అవు నవునే!"

"భూర్జరపత్రముపై నొకలేఖ వ్రాసి దానికీవకుళమాలిక చుట్టి, చక్రవర్తికొక పారావతముచే రాయబారము పంపవలె నని చూచుచున్నది. దానికొఱకై మనకెవ్వరికిని గనఁబడకుండ రాత్రింబవళ్లు విధముగఁ దాపత్రయపడుచున్నది".

"నిజముగా నే!"

"నేను చచ్చిపోయినంత ఒట్టే!"

ఆమాటతో నాగావళి చుట్టునున్న నలుగురు చెలికత్తెలును నొక్కసారిగ విఱుగఁబడినవ్వసాగిరి. ఇంతవఱకును నోపిక పట్టిన నాగావళి యిఁక నూరకుండలేకపోయెను. ఆమె తాను గ్రుచ్చుచున్న మాలిక యక్కడఁబెట్టి ఇంతకుఁబూర్వము దాను గుచ్చిన వకుళమాలికతో వకుళాభరణ నొక్కదెబ్బ కొట్టెను.

వకుళాభరణ యాదెబ్బఁ దప్పించుకొని, యామాలిక నాగావళి మెడలోవైచి, "నీవిప్పుడు నిజముగ స్వయంవరమునకు సిద్ధముగనున్న నవవధువువలె నున్నావే!" యని పకపక నవ్వెను.

నాగావళి "ఈబుద్ధులన్నియు నీమనస్సులోనే పుట్టినవి. లోపల నుండఁబట్టలేక యూరక నాపైఁ బెట్టుచున్నావు!" అనియెను. దానిపై వకుళాభరణ "సరేలే! ఎవరి కెటువంటిబుద్ధులున్నవో త్వరలోనే తేలిపోవునులే!" అనియెను.

**అటుతరువాత వారందఱును మహానదికి సమీపమున** నున్న చూతవనములోనికిఁ బోయి కిలకిల నవ్వుకొనుచుఁ బరిహాసములాడుకొనఁజొచ్చిరి.

అది చైత్రమాసము. సమీపమున మహానదీ తరంగఘోష మందమందముగ వినవచ్చుచుండెను. ఒక బలాకాపంక్తి రివ్వున నెగసివచ్చి తేఁగాలున మలుపుతిరిగి మాయమై పోయెను. సాయంకాలసూర్యుని శ్వేతకిరణములకు, నదీతరంగముల తాకిడికి మెదలుచున్న నీటిలోని యిసుక రేణువులు రంగు రంగులతో మెఱిసిపోవుచుండెను. దుర్భేద్యములగు తోసలీ నగరప్రాకారములపై మెల్లమెల్లఁగ నగారాల మ్రోఁత వినవచ్చుచుండెను. దూరమున నదీతీరమున సాయంకాలము చల్లగాలి సేవించుటకువచ్చిన జనసమూహములకోలాహలములోఁ దరంగఘోష మొక గంభీర శ్రుతివలె వినవచ్చుచుండెను. చెలికత్తెలందఱితోడనుగలిసి నాగావళి మెల్లమెల్లఁగఁ గోటలోనియంతఃపురోద్యానవనము విడిచి కన్యాంతఃపురమునకుఁ గదలిపోయెను.

## ౨

అశోకచక్రవర్తి వేఁటకై యరణ్యమునకువచ్చి యప్పుడే నాలుగైదుదినములు కావచ్చినది. అది పాటలీపుత్రనగరమునకు నాలుగైదు క్రోశముల దూరముననున్న యొక మహారణ్యము.

ఈయరణ్యమున కప్పుడప్పుడు చక్రవర్తి వేఁటకువచ్చుచుండును. ఇట్లు మాటిమాటికిని వేఁటకువచ్చుట యతని కంతగ నిష్టము కాదు. అయినను నాకాలమందలి హైందవ రాజ్యమర్యాదల ననుసరించి యాతఁ డప్పుడప్పుడు వేఁటకుఁ బోవలసి వచ్చుచుండెను. ఆతఁడు రాజ్యమునకు వచ్చి యప్పుడే యెనిమిది యేండ్లు కావచ్చినది. అతఁడిప్పుడు ముప్పదియేండ్లు నిండిన పరిపూర్ణ యౌవనముతో మిసమిస లాడుచున్నాఁడు. వేఁటకు వచ్చిన మొదటి రెండుమూఁడు రోజులును జాల నుత్సాహముతోఁ గడిచిపోయినవి. నాలుగవనాఁడు చక్రవర్తి వేఁటకు బయలుదేఱలేదు. ఏదియో కొంచెము బడలికగ నున్నదని చెప్పి యాతఁడు వేఁటమానివేసెను. అసలుకారణ మేమియో కూడ నెవరికిని దెలిసినది కాదు. బడలికగా నున్నదని విశ్రమించిన చక్రవర్తిని దర్శించుట కెవరికిని సాహసము కలుగలేదు.

చక్రవర్తి యరణ్యమధ్యమున నేర్పఱచిన సేనానివేశమునకు మధ్యభాగమున నొక సుందరపటకుటీరములో మృదువగు హంసతూలికాతల్పమున నెత్తగు నొక తలగడ కానుకొని శయనించియుండెను. సమీపద్వారమున నొక సుందరతరుణి దీర్ఘ కరవాలము ధరించి నిలువఁబడియుండెను. ప్రక్కనున్న హేమ తరుణీప్రతిమ దోసిలినుండి సన్నని యగరు ధూమమాలిక మెల్లఁగ మెలికలు తిరుగుచు ద్వారమునుండి మెల్లమెల్లఁగ నవలకుఁ బోవుచుండెను. చక్రవర్తి యటులే యర్ధనిమీలిత

నేత్రుఁడై యేదియో యాలోచించుచుండెను. ప్రాతఃకాల సూర్యకాంతి మెల్లఁగ నాబంగారుతరుణిప్రతిమ కపోలములపైఁ బడి యచ్చటినుండి మెల్లఁగ నెగురుచున్న ధూమలతికలపైఁ బడుచుండెను. ఆకాంతుల కా ధూమలత బంగారు ధూమ మాలికవలెఁ గానుపించెను. దూరమున నరణ్యములోని పక్షుల కలకలములు మంద్రమధురముగ వినవచ్చుచుండెను. అంతకును దూరముననుండి శోణానదీఘోషము వినవచ్చుచుండెను.

ఇంతలో మెల్లఁగ నడుగులచప్పు డయ్యెను. వెంటనే ద్వారముననున్న ద్వారపాలిక నేలపైఁ గరవాలము మోపి, వంగి నమస్కరించి సవినయముగ ద్వారపార్శ్వమున నిలువఁ బడెను. ఆవచ్చినయాతని పదధ్వనివిని చక్రవర్తి "ఎవరు సుందర గుప్తుఁడా!" యనెను. సుందరగుప్తుఁడు మెల్లఁగవచ్చి చక్రవర్తి తల్పమునకుఁ బ్రక్కనున్న బంగారు సింహాసనముపై గూర్చుం డెను. తరువాత నాతఁడు మెల్లఁగఁ జక్రవర్తినాడి పరీక్షించి కొంచెము సందేహించుచు నిట్లనియెను.

"మీకు నేఁడు బాగుగఁ దేలికగా నున్నట్లున్న దే!"

"అవును. తేలికగానే యున్నది. కాని కొంచెము బడ లికగా నున్నది."

"ఈవేళ మధ్యాహ్నవేళ వేఁటవారిని రమ్మందునా?"

"నేఁటికి వేఁట వలదు!"

"ఏమి ?"

"నేను శ్రమణక దేవాచార్యునిదర్శింపఁబోవుచున్నాను".

"ఆయన యెవరు?"

"బౌద్ధాచార్యులు. నీవు నిన్నజరిగిన సంఘటన నెఱుఁగవా ?"

"నాకుఁ దెలియదే!"

అశోకవర్ధన చక్రవర్తి గతదినమున జరిగిన సంఘటన మంతయు నాతనికిఁ బూసగ్రుచ్చినట్లువివరించెను. సుందరగుప్తుఁడదియంతయు నత్యాశ్చర్యముగ వినెను. వినుచున్నంత సేపును నాతని కేదో క్రొత్తలోకమున జరిగిన సంఘటన వినుచున్నట్లుండెను. చక్రవర్తిచెప్పిన గతదినమున జరిగినసంఘటన యిది:

అశోకచక్రవర్తి గతదినమున నొక లేఁడిపిల్లను దఱుముచుండెను. అది కొంచెమీఁదువచ్చిన లేఁడిపిల్ల కనుక నది చెంగు చెంగుననెగురుచు నాతని బాణపాతముల కందకుండఁ దప్పించుకొనిపోవుచుండెను. అది దాఁటిపోవుచున్నకొలఁదియు నాతనికిఁ బట్టుదల యెక్కువకాఁజొచ్చెను. పాపమది ప్రాణభయముతో చిన్నచిన్న యేఱులు, వాగులు దాఁటుచు నాతనిని ముప్పు తిప్పలు పెట్టుచుండెను. అప్పటికిఁక నొకజాముప్రొద్దుమాత్రమే యున్నది. ఎన్ని బాణములు వేసినను నది బాణముల నవ్వడిని బట్టి రివ్వురివ్వునఁ దప్పించుకొని పోవుచునేయుండెను. పరిక్కనున్న వేఁటకాండ్రకందఱికిని నాచిన్ని లేఁడిపిల్ల యాతని నావిధముగఁ దప్పించుకొని పోవుచుండుట చాల విచిత్రముగనుండెను.

వారు తలఁచుకొనినచో నొక చిన్న బాణముతో దానిని సంహ రించెదువారే! కాని యొకరు తఱుముచున్న మృగమును మఱి యొకరు తఱుముటగాని, సంహరించుటగాని మృగయాధర్మ విరుద్ధము. అందుచేత నెవరును నావిషయమై కలుగఁజేసి కొనుటకు జంకిరి.

చివరకుఁ జక్రవర్తి తన చాకచక్యమంతయు నుపయో గించి దానిపై నొక్క వాఁడిబాణము విడిచెను. అది దాని యెదురురొమ్మునకుఁ దగిలి కొంచెము గాయముచేసి దూసుకొని పోయెను. దానితో దాని శరీరమునుండి బొటబొట రక్తము ప్రవహింపఁజొచ్చెను. అయినను లక్ష్యపెట్టక, అది యదేవిధ ముగఁ బరువెత్తఁజొచ్చెను. దాని నాలుగుకాళ్ళును నొక్క సారిగ ముడుచుకొని యాకాశమున కెగిరిపోవుచున్నది. కాని పాప మది బాగుగ నలసిపోయినది. అమితముగ రక్తము కారు చుండుటవలనను, భయమువలనను దాని శరీరములో జవ సత్త్వము లుడిగిపోవుచుండెను. చివర కది యట్లు పరువెత్తి పరువెత్తి తలదాఁచుకొనుట కాసమీపముననున్న యొక బౌద్ధ విహారములోని కేఁగి యిఁక గదలఁజాలక స్పృహతప్పి యా విహారవృక్షచ్ఛాయలోఁ బడిపోయెను.

అశోకచక్రవర్తియును, నతనివెంట సంగరక్షకుఁడుగా నున్న మఱియొక యాశ్వికుఁడును నది బౌద్ధవిహారములోఁ బడి పోవుటఁ జూచి, దానిని బట్టుకొనుటకై, విహారములోని కేఁగి,

తమ గుఱ్ఱములుదిగి, కాలినడకతో లోపలికేఁగిరి. మొదటఁ జక్రవర్తి యంగరక్షకుఁడు లోపలికేఁగి, యచ్చటనున్న శ్రమణకులతో "నది తమ చక్రవర్తి తఱుముచున్న లేఁడియనియు దానిని దమ కప్పగించవలసియుండుననియుఁ జెప్పెను. కాని శ్రమణకులు తమ యాశ్రమధర్మము ననుసరించి, దాని నా యంగరక్షకుని కిచ్చుటకు నిరాకరించిరి. అంగరక్షకుఁ డావిషయము చక్రవర్తితో విన్నవించెను.

చక్రవర్తి కీవాక్య మెంతో యాశ్చర్యము కలిగించెను. తాను చక్రవర్తి! తా నంగరక్షకునితోఁ గలిసి యచ్చటకు వచ్చుటయె చాలు! వారు సార్వభౌముఁడు తమ సన్నిధికి వచ్చినాఁడని యెంతో సంతసించి, చేతులుజోడించుకొని వినయవిధేయతలతోఁ బ్రవర్తింపవలసినది. అది లేనేలేదే! చక్రవర్తి శ్రమణక దేవుఁడుగూడఁ దన కెదురువచ్చుననియుఁ దనతో సంభాషించుటయె భాగ్యమని తలంచుననియు భావించెను. కాని యది యట్లు జరుగలేదు. అతఁ డట్లే యాలోచించుచు నిలువఁబడి యుండెను.

ఇంతలోఁ గొందఱు శ్రమణకులచ్చటికివచ్చి, చక్రవర్తిని ససంభ్రమముగ లోపలికిఁదోడ్కొని యాతని నొక యాస్తరణమునఁ గూర్చుండఁజేసి, ఫలాహారాదికములచే ననేకవిధముల గౌరవించిరి. అనంతరము వా రాతని నొక విశాలవటవృక్షముసీడకుఁ గొనిపోయిరి. అచట నొక యున్నతవేదికపై నొక తేజశ్శాలి

యర్ధశయనమూర్తియై కూరుచుండియుండెను. అతనిచుట్టును నలుగురైదుగురు శ్రమణకులు ధ్యాననిమగ్నులైయుండిరి. వేదిక పైనున్న శ్రమణకాచార్యుఁడు ప్రశాంతముగ నేదో ధ్యానించు చున్నట్లుండెను. అతనికనులకు ఱెప్పపాటున్నట్లుకూడఁ గనఁబడ లేదు అతనిముఖములో నెంత ప్రశాంతత్వమున్నది! చక్రవర్తి యంతకుఁబూర్వము లక్షలాదిగ మానవముఖములు దర్శించి నాఁడు. ప్రతిముఖమునందును నేదోయొక యుద్విగ్నత, ఏదో యొక భయము కానవచ్చుచుండెడిది. ఈ మహాపురుషుని ముఖము పూర్ణిమనాఁడు నిస్తరంగమగు కాసారమువలెనున్నది.

చక్రవర్తి మొదట నాతనిఁజూడఁగనే తన లేఁడివిషయమై ప్రస్తావింపవలెనని యనుకొన్నాఁడు. కాని యామహాపురుషుని జూడఁగనే యాతఁడావిషయమే మఱచిపోయినాఁడు. అట్లే యాతని ముఖముపై పై కనురెప్పవేయక చూచుచుఁ గూర్చు న్నాఁడు. తనతో వచ్చిన యంగరక్షకుఁడు విహారద్వారమున వేచియున్నాఁడను విషయముకూడ నాతఁడు మఱచిపోయి నాఁడు. అరగడియవరకును నచటనున్న వారందఱు నిశ్చల సమాధిలో నున్నట్లుండిరి.

కొంతసేపటికి శ్రమణకాచార్యుఁడే హఠాత్తుగ మాట్లా డుట కుపక్రమించెను. మంద్రగంభీరమగు నాతని వాక్యములలో వారికందఱికిని ప్రేమమాధుర్యములు జాలువాఱుచున్నట్లుండెను.

“సార్వభౌమా! రాజ్యరక్షణము సార్వభౌమధర్మము కాదా?”

"అవును !"

"అయినచో నమాయికమగు నీ మృగజాతిని హింసించుట యేమిధర్మము ?"

చక్రవర్తి కామాటకుఁ దటాలున సమాధానము తోఁపలేదు. అయినను నాతఁ డొక కొంతసే పాలోచించి "పైరు పంటలు నాశనముచేయు మృగజాతిని వేఁటాడుట రాజధర్మము కాదా !" అనెను.

"ఈ యరణ్యమధ్యమున నివసించు నీ యాశ్రమ మృగ మెక్కడనో యున్న జానపదుల పైరుపంట లెట్లు నాశనము చేయును ?"

"నాకిది యాశ్రమమృగమో యరణ్యమృగమో నిర్ణయించుట యెట్లు సాధ్యమగును ?"

"దుష్టు లెవరో శిష్టు లెవరో నిర్ణయింపలేకపోయినచో నిఁక రాజధర్మ మేమున్నది ?"

అశోకవర్ధనుని కిఁక సమాధానము చెప్పుటకు వీలుపడ లేదు. అతని చెవులలో "నిఁక రాజధర్మమేమున్నది? ఇఁక రాజ ధర్మమేమున్నది" అనుమాటలు మాటిమాటికిఁ బ్రతిధ్వనించుచు గింగురుమని మాఱుమ్రోయుచున్నట్లుండెను. ఆపై నాతఁ డేమియు మాటలాడలేదు. కొంతసేపటికి శ్రమణాచార్యుఁడు "సార్వభౌమా! పాప మీలేఁడిపిల్ల మెచ్చటనో యింత పచ్చిక మేసి, పుడిసెఁడు నీళ్లుత్రావి జీవించుచున్నదిగదా! ఈ యరణ్య

మధ్యమునఁగూడ దానికి సుఖముగ జీవించుట కవకాశము లేదా! పాప మది యెవరి కేమి యపకారము చేసినది? దానిపై బాణము వేయుటకు మీకుఁ జేతు లెట్లువచ్చినవి? రాజ్యముననున్న ప్రాణు లందఱిని దండ్రివలెఁ జూడవలసిన సార్వభౌముఁడే వానిని సంహరింపఁదలపెట్టిన చో నిఁక వానికి దిక్కేమున్నది!" అనియెను.

ఆమాట లనుచున్నంతసేపును నాతని నయనములనుండి కరుణాశ్రువులు జాలువాఱుచున్నట్లుండెను. చక్రవర్తికిఁగూడఁ గొంచెము కన్నులు చెమ్మగిల్లెను. మరల శ్రమణాచార్యుఁడు "ముద్దుముద్దుగఁ జెంగుచెంగున గంతులువేయు నీ లేళ్ళను సంహరింపఁ దలఁపు లెట్లుకలుగునో నాకు బోధపడకుండ నున్నది!" అనెను. అతఁడట్లు పలుకుచున్నంతసేపును రాజుముఖము వైపు తదేకదృష్టితోఁ జూచుచు నాతనిముఖమువైఖరి పరీక్షించుచునే యుండెను. అటుపిమ్మట శ్రమణకాచార్యుఁ డొకకొంత తడవు మాటలాడకూరకుండి మరల నిట్లు బోధించెను.

"సార్వభౌమా! సహజముగఁ బ్రాణులన్నియు మన కన్నదమ్ములవంటివి. వీతరాగు లగు వారికీవిషయములన్నియుఁ బ్రత్యక్షసత్యములవలె గానిపించును! అన్నా! అన్నిప్రాణు లందును సోదరభావము నెఱపుటలో నెంతయానంద మున్నది!" అనియెను.

సార్వభౌముఁడింతటితో లోలోపలఁ జాల పశ్చాత్తాప పడి, తాను చేసిన తప్పిదము క్షమింపవలయు ననియు, నింతటి

నుండి యెన్నఁడుననవసరముగఁ బ్రాణిహింసయొనర్పననియుఁ బలికి యాతనికడ సెలవుతీసికొని తన సేనానివేశమునకుఁ దిరిగి వచ్చివేసెను.

తిరిగి వచ్చిన తరువాత తన పటకుటీరములో విశ్రమించి శరీరమస్వస్థముగానుండుటచే వేఁటకు రాఁజాలనని సుందరగుప్తునకుఁ గబురంపించెను. హంసతూలికాతల్పమునఁ బండుకొన్నను నాతనికి రాత్రి చాల సేపటివఱకును నిద్రపట్టలేదు. అతనికా నాఁడు జరిగిన సంఘటనలన్నియు నేదో యొకస్వప్నమున జరిగినటులు కానిపించెను. ఆ శ్రమణదేవునిజూడఁగనే యది యేమి చిత్రమోకాని, యాతని మనస్సులోని చక్రవర్తి గర్వమంతయు నొక్కసారిగ నణఁగిపోయెను. నిజముగ నాశ్రమణకాచార్యుని కన్నులలోని నిశ్చల ప్రశాంతిలో నెంతరాజసమున్నది! ఆతని సర్వసంగపరిత్యాగములో నెంతటి మహైశ్వర్యమున్నది! సర్వ ప్రాణులను దన కరుణచే లోఁగొనఁగలిగిన యాతఁడే నిజముగు సార్వభౌముఁడు! ఆహా! ఆశ్రమణక దేవుని జీవితములో నెంతటి పరిపూర్ణ ధన్యత్వమున్నది! చక్రవర్తి మాటిమాటికి నాతనికా ప్రశాంతత్వ మెట్లలవడెనో యని యాశ్చర్యపడఁ జొచ్చెను. ఆ విధముగ ననేక విచిత్రాలోచనలతో నా రాత్రి యంతయు గడచిపోయెను.

చక్రవర్తికి సుందరగుప్తుఁడు చాల దగ్గరచుట్టమేకాక మిత్రుఁడుకూడ. సామాన్యముగఁ జక్రవర్తి తన రాజ్య వ్యవహారములేకాక, స్వీయవిషయములుకూడ నాతనితో ముచ్చ

టించుచుండును. నేఁడుకూడ నేమియుఁదోఁచక నాతనికి శ్రమణక దేవుని దర్శించినదాదిగ జరిగిన సంఘటనలేగాక, తన మనస్సున నుద్భవించిన విచిత్రాలోచనలన్నియుఁగూడ బూసగ్రుచ్చినట్లుగ నివేదించెను.

సుందరగుప్తుఁడు సహజముగ వినోదప్రియుఁడు. అందుచే నాతఁ డెట్లయినఁ జక్రవర్తిని వేఁటకుఁ దీసికొని పోవలయునని ప్రయత్నించెను. కాని సార్వభౌముఁ డందుల కంగీకరింపక, శ్రమణక దేవుని దర్శించితీరవలయు నని పట్టుపట్టెను. అందుచే సుందరగుప్తునకుఁ జాల నాశాభంగమే కలిగినది. అశోకచక్రవర్తి యానాఁడు శ్రమణకాచార్యుని దర్శించి, వేఁటయంతయు నిలిపి వేసి సేనానివేశము కంతటికిని రాజధానికిఁ దరలిపోవలయునని యాజ్ఞాపించెను. చక్రవర్తిలోఁ గలిగిన యీ హఠాత్పరిణామమున కందఱును నాశ్చర్యపడిరి. సుందరగుప్తుఁడిది చక్రవర్తిలోఁ గలిగిన తాత్కాలిక విరక్తిభావమని తలఁచెను. ఏమైనను జేయునదిలేక సేనానివేశమంతయు రాజధానికిఁ దరలించివేసెను.

## 3

క్రైస్తవశకమునకుఁ బూర్వము రెండువందల యిరువది యవ సంవత్సరమునకు భారతదేశమున నుత్తరభాగమంతయు నించుమించుగ నశోకచక్రవర్తికి స్వాధీనమయిపోయెను. ఉత్తర భారతదేశమున నచ్చటచ్చటఁ గొన్ని స్వతంత్రరాజ్యము

లున్నను నవియన్నియుఁ జక్రవర్తిసార్వభౌమత్వ మంగీకరించి, కప్పములు కట్టుచునేయుండెను. కాని దక్షిణభారతముమాత్ర మింకను జక్రవర్తిసార్వభౌమత్వ మంగీకరింపలేదు. మహానది మొదలుకొని పిష్టపురమువఱకును వ్యాపించిన 'కళింగ' రాజ్యమున ననేకరాజ్యములు తలయెత్తుచు నంతరించి పోవుచుండెను. అంతకును దక్షిణముగానున్న దేశములోఁగూడ దాక్షిణాత్య రాజన్యుల పరిపాలనము సాగుచుండెను. మనకాలమున నించు మించుగ మహానది మొదలు లాంగుల్యానదివఱకునుగల దేశ మంతేయు మహేంద్రకేసరి పరిపాలనములో నుండెను. మిగిలిన కళింగరాజ్యమంతయుఁ బిష్టపురము రాజధానిగఁ బరిపాలించు చున్న కళింగమల్లుని యధీనమున నుండెను. ఈకళింగమల్లునకి మహేంద్రకేసరికిని నప్పుడప్పుడు చిన్నచిన్న వివాదములు సంభవించుచుండెను. కాని మహేంద్రకేసరి యవి చిలికి చిలికి గాలివానలు గాకుండఁ గాలక్షేపము చేసికొని పోవుచుండెను.

కళింగమల్లుఁడు చాల జిత్తులమారి. సహజముగ మహేంద్రకేసరి రాజ్యముకంటె నాతని రాజ్యము విస్తీర్ణమైనది. అందుచే సహజబలశాలియగు నాతఁడు సైన్యముల నాయత్తము చేసికొని యెప్పటికప్పుడు మహేంద్రకేసరి రాజ్యము కబళింప వలయునని చూచుచుండెను. కాని యొకవేళ మహేంద్రకేసరి యశోకచక్రవర్తి సాహాయ్య మపేక్షింపవచ్చుననియు, నప్పుడది యొక పెద్ద యుద్ధమై తనకే మహాపత్కారముగఁ బరిణమింప వచ్చుననియు నాతని భయము. అందుచేత నాతఁ డీమధ్యకాల

మున మెల్లఁగ మైత్రిచే మహేంద్రకేసరిరాజ్య మపహరింప
వలయుననియు నావిధముగఁ గళింగమునకుఁ దాను సర్వాధి
పత్యము వహింపవచ్చుననియు భావించెను.

యుద్ధముకంటె నిది చాలఁ దేలికయగు నుపాయమని
యాతఁడు తలఁచెను. ఒకవేళ మహేంద్రకేసరి దీని కంగీకరింప
కున్నచో నెట్లైనను దండోపాయ ముండనేయున్నది. అందుచేఁ
గళింగమల్లుఁడు నాగవర్మయను తన మంత్రిని మహేంద్రవర్మ
కడకు రాయబారిగఁ బంపెను.

నాగవర్మ రాక విని మహేంద్రకేసరి యాతనికి దన
రహస్యాలోచనామందిరమున దర్శనమిచ్చెను. నాగవర్మ యఱు
వదియేండ్లముదుసలి. ముండితశిరస్కుఁడగు నాతని కనుబొమలు
నెరిసి ముడుతలుపడియుండెను. నాగవర్మ లోనికి రాఁగానే యొక
సారి యాగృహమంతయుఁ గలయఁజూచెను. ఆగృహ వాతాయ
నములపైఁ దెల్లని దుకూలాంచలములు వ్రేళ్ళాడుచుండెను.
దూరమున మహానది యిసుకతిన్నెలపైఁ దెల్లని కొంగలవరుస
మెల్లగ నెగురుచు నాహార మన్వేషించుచుండెను. ఇంకను
నక్కడక్కడ మిగిలిన మంచుపొరలచే దూరాకాశమునఁ దాళ
వృక్షాగ్రము లస్పష్టముగఁ గన్పట్టుచుండెను. నీరెండ మహానదీ
సైకతములపై గొంచె మెఱ్ఱని పట్టువస్త్రమువలె గానవచ్చు
చుండెను. మహానదీనీరము లాయెండలో నీలములవలె స్వచ్ఛ
ముగఁ గానుపించుచుండెను. మంచుచేఁదడిసిన మహానదీసైకత

ములపై మనుష్యుల పాదచిహ్నముల వరుసలు దూరమున కస్పష్టముగ నుండెను.

నాగవర్మయు మహేంద్రకేసరియుఁ గూరుచున్న గృహము రాజప్రాసాదమునఁ జిట్టచివరి యంతస్థుపై నున్నది. మహేంద్రకేసరి యాతని సమీపమున సాదరముగఁ గూర్చుండెను. కుశలప్రశ్నాదికము లన్నియు నయిన తరువాత మెల్లఁగ వారి సంభాషణము ప్రకృత విషయమునకు దిగెను. ముందు మహేంద్రకేసరి యాతని నేవిషయమో ప్రశ్నించెను. దానిపై నాగవర్మకొంచెముసేపాగి యీవిధముగ సమాధానముచెప్పెను.

“మా రాజ్యము ప్రశాంతముగ సాగిపోవుచున్నది. కాని యశోకచక్రవర్తి కళింగముపై దండెత్త నున్నాఁడని తెలియుచున్నది. అందుచే మాప్రభువు దాక్షిణాత్యరాజన్యులందఱును దమలోఁదాము కలహించుటలుమాని యీ యౌత్తరాహుల దండయాత్ర నెదుర్కొనవలయునని చూచుచున్నారు”.

“మేమీ విషయమునఁ గళింగమల్లప్రభువుతో నన్ని విషయములందును నేకీభవింపఁగలము. ఈవిషయమున మా సైన్యములును, ధనధాన్యములు మీ యధీనములు”.

“అశోకవర్ధనుఁడు దండెత్తివచ్చినచో మున్ముందుగ నీ తోసలీ రాజధాని నాక్రమింపవలసియుండును. అందుచే నాతని దండయాత్రలో మొట్టమొదటియాహుతి మీనగరమే”.

“అవునవును! మేముకూడ నీవిషయమున భయపడుచునే యున్నాము”.

"మా ప్రభు వన్యోన్యరక్షణాభిలాషతో మీతో దృఢ తరమైత్రి కావలయునని యభిలషించుచున్నారు".

"వారి యవ్యాజాదరాభిమానములకుఁ దోసలీరాజ్య మెంతో ఋణపడియున్నది".

ఈవిధముగ మహేంద్ర కేసరి యనిన తరువాత నాగవర్మ యాతనికింకను సమీపమునకు జరిగి, యటునిటుజూచి, కొంచె ముదగ్గి యాతనికన్నులలోఁ జూచుచు మరల నిట్లుపలికెను.

"మహారాజా! ఈవిషయమున సామాన్యసంధి పత్రముల కంటె నింకను దగ్గర సంబంధ మేర్పడవలయునని మాప్రభు వభిప్రాయ పడుచున్నారు".

"అనఁగా!"

"ఏమియు లేదు! వారింకను దృఢతరసంబంధము కాం క్షించు చున్నారు."

"క్షమింపుఁడు! మీ యభిప్రాయ మేమో నే నవగాహన చేసికోలేకుండ నున్నాను".

"వారిమనస్సులో నున్నదియున్నట్లుగ విన్నవింపుమని సెలవా?"

"ఎంతమాట!"

"వారి పార్థనలో ననౌచిత్య మేమైన నున్న చో మీరు మనసార మన్నింపవలయును".

ఈ వృద్ధుని మాటలతో మహేంద్రకేసరికి లోపల నారాటమెక్కుడయ్యెను. అయినను నాతఁడాయారాటమణఁచి

పెట్టి, ముఖముపై లేని చిఱునవ్వు తెచ్చిపెట్టుకొని, నాగవర్మ రెండుచేతులను బట్టుకొని,

"నావంటి సన్నిహితునిదగ్గర మీ కెందులకింత సందేహము! తప్పక కళింగమల్లప్రభుని యభిప్రాయమేదో సెలవిండు. నేను మాఱు మాటాడక శిరసావహించెదను" అనెను.

"ఏమియు లేదు! మహారాజుల కేకపుత్రు(డున్నను లేనట్టేయని మన ధర్మశాస్త్రములు చెప్పుచున్నవిగదా! వారికొక్క(డే కుమారు(డు. తరువాత( బుత్త్రికాసంతానమేగాని మరల( బుత్త్రసంతానము గలుగలేదు"

"అటులనా!"

"అందుచేత వారు మరల వివాహమాడ నభిలషించుచున్నారు".

"ఈవేళ మాకెంతో శుభవర్తమానము తెలియ(జేసినారు. వివాహ మెప్పుడు?"

"ఇంకను నిశ్చితము కాలేదు. వారికెందరు మహారాజులు తమ కుమార్తెల నిచ్చెదమన్నను సంతృప్తికలుగలేదు. అందుచే నీవిషయమై మీ సన్నిధికి నన్ను బంపించినారు."

"ఈ విషయముననా!"

ఈమాటతో నాగవర్మకు డెక్కపట్టినట్లయ్యెను. అయినను నాత(డు కలకల నవ్వుచు "అదేమి! అట్లనుచున్నారు! ఇందులో విడ్డూరమేమియు లేదే!" అనెను.

ఆపై మహేంద్రకేసరి యీఁక విషయము వ్యంగ్యముగఁ జెప్పిన లాభములేదని తలఁచి "మాపెద్దమ్మాయికిని మీప్రభువులకును వయసులో నెక్కువ వ్యత్యాస ముండుననుకొనెదను. అందుచే నిది నాకు కొంచెము విడ్డూరముగనే కనఁబడినది!" అనెను.

మరల నాగవర్మ "ఎంతమాట! నేనుమాత్రము కేవల మంత వయోవ్యత్యాసమున్న సంబంధము చేయుమందునా! మీకొమార్తె వయస్సెంత!" అని యడిగెను.

"పదునెనిమిది యేండ్లు"

"అయినచో వయస్సులో నంత వ్యత్యాసములేదే!"

"కళింగమల్లప్రభువుల వయస్సెంత!"

"ఇంకను నలుబదియేండ్లు నిండలేదు."

మహేంద్రకేసరికి కళింగమల్లునికి సుమారేబదియేండ్లు వయస్సుండవచ్చునని నిశ్చయముగఁ దెలియును. అందుచే నాతఁడీవిషయము మృదువుగఁ దిరస్కరించుట తప్పదని నిశ్చయించి 'క్షమింపుఁడు' వారిసంబంధ మన్నివిషయములలోను గండ్లకద్దుకొనవలసిన సంబంధము. నిజముగఁ బిల్ల కొంచెము వయస్సున్నదైనచోఁ దప్పక యీవిషయమున నెరిగి గంతువైచి యంగీకరించెడువాఁడను. కాని పిల్లకింకను పదునెనిమిదియేండ్లే యగుటచే నాకీవిషయమున నుత్సాహము కలుగుటలేదు' అని చెప్పివైచెను.

దానికి నాగవర్మ "మహాప్రభూ! నామనవి కొంచెము సావధానముగఁ జిత్తగింపుఁడు. వయస్సులో నంతగా లెక్క పెట్ట వలసిన పెద్ద తేడా యేమియులేదు. మన రాజకుమారులలో నలువదియేండ్లైనను నంతగ లెక్కపెట్టవలసినవయస్సు కాదు. అది యటుండనిండు. దీనివలననుభయ రాజ్యములకునుదక్షిణాపథము నకును గలుగఁబోవు క్షేమమువిషయ మాలోచింపుఁడు" అనెను.

"నేనెల్లప్పుడును గళింగమల్లప్రభువుతో సంధికిని గళింగ సంరక్షణకుఁ దగు నేర్పాట్లకును సంసిద్ధుఁడనే. ఈవిషయమునఁ గళింగ దేశరాజన్యు లందఱును నొకత్రాటిమీఁద నడిచినచో నే నందులకు భిన్నముగఁ బోవువాఁడనుగాను. వీరందఱును నేదోయొక మార్గమవలంబించి నాకెఱింగించినచో నేను మాఱు మాట్లాడక మీతోఁ గలిసివచ్చెదను. నేనీవిషయములో వివాహసంబంధముతో ముడిపెట్టవలసిన యవసరము లేదను కొనుచున్నాను."

"పోనిండు! నేను మీతో వాదింపవలసినవాఁడనుగాను! కాని మీమైత్రి దృఢమైనదనియును విశ్వసనీయమైనదనియును గట్టిగ మాప్రభువుతో విన్నవించుకొనుటకు నాకేదైన నవకాశ ముండనక్కఱలేదా!"

దీనితో మహేంద్ర కేసరి కరికాలిమంట నెత్తికెక్కిన ట్లయ్యెను. అయినను నాతఁడు కొంచెము శాంతము వహించి "మిగిలిన కళింగ రాజులందరును దమమైత్రిస్థిరమైనదని ఋజువు

చేసికొనుటకుఁ గళింగమల్లదేవునికి తమ కన్యలనుగూడ నర్పించుచున్నారా!" అనెను.

ఇఁక నాగవర్మ మాటలాడలేకపోయెను. కొంచెము సేపేమియు మాట్లాడక నేలవైపుచూచుచు "సరే! నామనవి మీరావిధముగ స్వీకరించినచో నిఁక ప్రత్యేకముగ మీకేమి చెప్పఁగలను? మాప్రభువులు కళింగమంతయు నొక్కతాటి మీఁద నడిపించి యాత్తరాపథుల దండయాత్ర యెదుర్కొన వలయునని యనేక విధములుగ నువ్విళ్ళూరినారు. ఎప్పుడేమి జరుగునో చెప్పలేము. కళింగరాజ్యముల కెట్టియుత్పాతములు వ్రాసిపెట్టియున్నవో యని నాకు మిక్కిలి భయము గలుగు చున్నది. ఇంతకును దైవసంకల్పమెట్లున్నదో తెలియదు. కానున్నది కాకమానదు" అని బదులు పలికెను.

మహేంద్రకేసరి యామాటలకేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. ఆతనికి నాగవర్మ మాటలలోని యంతరార్థ మంతయు నవగతమైనది. అయినను నాతఁడు బాలికను వృద్ధున కిచ్చి వివాహముచేయుట కిష్టపడలేదు. ఆతఁడుకూడ "కానున్న దేదో కాకమానదు!" అని మొండిధైర్యము వహించి మాట్లాడకూరకొనెను. నాగవర్మ యొకకొంచెము సేపుండి 'మరి నాకు సెలవిప్పింపుఁడు. నేను మనవిచేసిన విషయము మఱల నింకొకసారి పరిశీలింపుఁడు" అని పలికి యాతని దగ్గఱ సెలవు తీసికొని పిష్టపురమునకు మరలిపోయెను.

# ౪

నాగవర్మ మరలిపోయినప్పటినుండియు మహేంద్ర కేసరి కించుకైనను శాంతిలేకపోయెను. కళింగమల్లుఁడు చిన్నవైన వ్యక్తి కాఁడు. ఒకవంక నాతఁడు తోసలీనగరముపై దండెత్తి రానున్నాఁడను వార్త లిదివరకే వ్యాపించినవి. అపైన నీరాయ బారము! తాను ముసలివాఁడను కారణముచే మహేంద్రకేసరి తనకుఁ బిల్లనీయనన్నాఁడని యాతనికిఁ దెలిసినచో నాతఁడు క్రోధక్రోధ్కిన్న త్రాఁచువలె భగ్గున మండిపడును. ఇఁక నాతని పన్నాగములకును కుతంత్రములకును నడ్డే యుండదు. ఇది యిట్లుండ నశోకవర్ధనుని ప్రధానమంత్రియగు సారంగపాణి కళింగజయమునకై తగిన సన్నాహము లొనర్చుచున్నాఁడని తెలియుచున్నది. నాగవర్మ చెప్పినట్లు కళింగ విజయములో మొదటియాహుతి తోసలీరాజధానియే. పోనీ యిటువైపున నశోకునితో మైత్రిచేయుదమన్న యిదివంక పెట్టి కళింగమల్లుఁడు తనపై దండెత్తిరావచ్చును. అతఁ డిదివరకే సైన్యములన్నియు నాయత్తపరచు కొన్నాఁడని తెలియుచున్నది. ఇఁక నిరువురి తోడను మైత్రినెరపుచుఁ గేవలమును దటస్థముగనుండుట మూఁడవమార్గము. ఇట్లుండవలయుననియె యాతనిసంకల్పము. కాని నాగవర్మను ద్రిప్పి పంపివేసినప్పటినుండియు యామైత్రికి భంగము కలిగెను. నాగవర్మ వెడలిన తరువాత తనరాజ్యము నకును గళింగమల్లుని రాజ్యమునకును సరిహద్దులలో నున్న

యుభయుల సేనలకును దఱచుగ సంఘర్షణములు కలుగు చుండెను. అయినను నాతఁడు ధైర్యమువిడువక తన సేనలతో నుచితరీతిని కట్టుదిట్టము లొనరించుకొనుచుండెను. కళింగమల్లుని సేనలు దురుసుతనము వహించి తనపైకివచ్చి పడుచున్నను నోరిమివహించి తెగఁదాలు రాకుండఁ జూచుకొనవలసినదని సేనానాయకుల కాజ్ఞాపించెను.

అయినను మహేంద్రకేసరి కెప్పు డేయుపద్రవము తటస్థించునోయని లోలోపల భయముగలుగుచునేయుండెను. ఈ వేళ మహేంద్రకేసరి కోటకానుకొనియున్న యుద్యానవనమున విశ్రమింపనేగెను. ఆతనితో రాణియుఁ గొమార్తెయుఁ గూడ వచ్చిరి. నాగావళి యీనాఁడు తండ్రి యీవిధముగ వైమనస్య ముతో నుండుటకు గారణమేమియో తెలిసికొనలేకుండెను. ఆమె నదీతరంగములవై పేదో పరధ్యానముగ నున్నట్లుచూచు చుండెను. నదీతరంగములలో రెండు రాజహంసములు తూగు టుయ్యాల లూగుచు నొకదానితో నొకటి సంభాషించు చున్నట్లు చంచువులు దగ్గరగఁజేర్చి కలకలరవము లొనర్చు చుండెను. ఆమె వానిని జూచుచు వాని యానందమున కెంతో ముచ్చటపడుచుండెను.

అప్పుడే వసంతముగడచి గ్రీష్మము రాఁబోవుచున్నది. ఇప్పు డిప్పుడే కొంచెము చల్లగాలి తిరిగినది. ఎండవేఁడిమికి గూళ్ళలో దాగుకొనిన పక్షులన్నియుఁ గిలకిలధ్వనులొనర్చుచు

నీవలకు వచ్చుచుండెను. వృక్షచ్ఛాయలలో నెండవేఁడిమివలన సాంధ్యాతప మెట్టిరంగు కలబోసినట్లుండెను. ఆహంసల కలకలములో నాగావళికి దన తల్లిదండ్రులు మెల్లఁగ మాటలాడుకొనుచున్నట్లు వినవచ్చెను. ఆమె ముందునకుఁ జూచెను. తల్లిదండ్రు లిద్దఱును దనకు ముందుభాగముననున్న పొదరింటిలోఁ గూర్చుండి మెల్లఁగఁ బ్రసంగించుకొనుచున్నారు. గాలితనవైపే వీచుచుండుటవలన నామెకు వారిమాటలు కొంతవఱకు స్పష్టముగనే వినవచ్చుచుండెను. కొంతసేపటి కామెకు వారి సంభాషణములఁ దనపేరుగూడ వినవచ్చెను. అందుచే నామె వారిసంభాషణ మత్యాసక్తితో వినఁజొచ్చెను. ఆమెకు మొదటఁ దండ్రి మాటలు వినవచ్చెను.

"మన కెలుఁజూచినను నాపత్కరముగనే యున్నది. ముందు నూయి, వెనుక గోయి."

"పోనీ! అశోకవర్ధనచక్రవర్తి సాహాయ్య మర్థింపఁ గూడదా?"

"ఈసంగతి తెలిసినచోఁ గళింగమల్లుఁడు రేపే మనపైకి దండెత్తివచ్చును."

"మనము నాగావళి నీయ నన్నందున నెటులైనను నాతఁడు మనపైఁ బగబట్టియే యున్నాఁడుగదా!"

"ఆ పగ మఱింత యెక్కుడగును. అది యటుండనిమ్ము. ఇంతకును నశోకచక్రవర్తి సాహాయ్యముచేయునని నమ్మకమేమున్నది."

"పోసీ! మనరాయబారిని బంపి యీ విషయము తేల్చు కొనరాదా!"

"పోసీ! నాగావళిని గాంగమల్లునికిచ్చినచో నెట్లుండును"

"మొదట యీయనన్న తరువాత నిప్పుడిచ్చినను నాతని కోపము తీఱునా!"

"బంధుత్వమువలనఁ జాలవఱకాతనికి మనపై నాను కూల్య మేర్పడవచ్చునని యనుకొందును."

"ఆతరువాత నిఁక మనరాజ్యమున కుపద్రవము తీరి పోవునా!"

"ఏమి చెప్పఁగలము. ఎప్పటికైనను మన మాతనికి సామంతులము కావలసినదే!"

"అట్లయినచో నావృద్ధునికిఁ బిల్లనిచ్చి యాతనికి సామంతులమగుటకంటె, చక్రవర్తికే మన తనూజనిత్తుమని కబు రంపించి, యాతనికి సామంతులమగుట మంచిదికాదా!"

"చక్రవర్తి మనవంటి సామంతుల తనూజ నంగీక రించునా!"

"పోనీ మనము సామంతులమగుదుమనిన మనలను రక్షింపఁడా!"

"ఏమో! ఏమిచెప్పఁగలము!"

ఈమాటలన్నతరువాత నాతని ముఖము నుండి యొక పెద్దనిట్టూర్పు బయలుదేఱెను. ఆవిషయమున నేమి నిశ్చ

యుంచుటకును నాతనికిఁ జాలుపోలేదు. అతఁడట్లే శూన్య దృష్టితో నేదో యాలోచించుచుఁ గూరుచుండెను. క్రమక్రమముగా నెండ తగ్గిపోవుచున్నది. రాణి యాపత్కరములగు నీ పరిస్థితులు తలఁచుకొని దీనయై కూరుచుండెను.

చివరికి రాణి యొక నిట్టూర్పువిడిచి "వెంటనే యశోక చక్రవర్తికడ కతిరహస్యముగఁ బ్రధానామాత్యుఁడగు హేమ నందిని బంపుఁడు. ఏమి జరుగునో యది జరుగును. ఊరక దైన్యమవలంబించినఁ బ్రయోజనమేమున్నది!" అనియెను. ఆపై మహేంద్రకేసరి మరల నొకనిట్టూర్పు విడిచి "ప్రధానా మాత్యులీవిషయమున బొత్తిగా నేకీభవింపకున్నారు. ఆయన యశోకునితో రాయబారములు నడిపినచోఁ దాక్షిణాత్య రాజులందఱకు నొక్కపెట్టునఁ గోపము రావచ్చుననియు, దాని వలనఁ దోసలీరాజ్యముపైఁ గళింగమల్లుఁడు దండెత్తివచ్చుట కొక మిషయేర్పడవచ్చుననియుఁ గళింగమల్లుఁడు దండెత్తి వచ్చినచో నిక మనరాజ్యమే యుద్ధక్షేత్రమై సర్వనాశనముఁ జెందవచ్చుననియు భయపడుచున్నారు' అనియెను.

మరలఁ గొంతసేపటివఱకును నెవరును నేమియు మాట లాడలేదు. అప్పటికి సాయంతనము కాఁజొచ్చెను. క్రమముగా నదీతరంగముల ఘోష యెక్కువ కాఁజొచ్చెను. ఆ ఘోషల నామెకుఁ దలిదండ్రులమాటలంతగా వినఁబడలేదు. ఆమెకాపై నంతగా వినవలయుననికూడఁ గోరిక కలుగలేదు. ఆమెకుఁ దన

మూలమునఁ దలిదండ్రులకును రాజ్యమునకును బ్రజలకును గలుగఁబోవు దుఃఖము తలఁచుకొన్నప్పు డెంతో బాధకలిగెను. క్రమముగ నామె కన్నులనుండి రెండు కన్నీటిబిందువులు జారి కపోలములపైఁబడెను. అగుటకు తాను మహారాజు తనయయె కాని తనజీవిత మీవిధముగ నాపత్కరమైపోయినది! ఈ యాపత్తునుండి తమకుటుంబము నుద్ధరించువాఁ డశోకచక్రవర్తి యొక్కఁడే! ఆతనినిఁ దలఁచుకొన్నప్పు డామెహృదయమున నొకవిధమగు నుత్కంఠ బయలు దేరుచుండెను. ఆతఁడు తనతండ్రి రాయబారమున కనుకూలముగ సహాయమొనర్చినచో నెంత బాగుండిపోవును? నిజముగ నట్లు జరుగునా? తమ కిప్పు డశోక చక్రవర్తిదగ్గఱకు రాయబార మంపుటయె యాపత్కరమగు సంఘటనకు దారితీయునేమో యని భయమగుచున్నది. ఆమె యొకసారి సాహసించి తల్లితో "ఎట్లైనను గళింగమల్లుఁ డీకఁ దమపై పగసాధించితీరును గాన నశోకచక్రవర్తి సాహాయ్యము నకై రాయబార మంపిన బాగుండదా!" యని యనవలయు నని యనుకొన్నది. కాని లోలోపల బయలుదేఱిన సిగ్గామె సంకల్పము లోలోపలనే యణచివేసినది. ఇంతలో "నాగావళీ!" యను పిలుపు వినవచ్చెను. సాయంకాలమగుటచేఁ దలిదండ్రు లుద్యానవనమునుండి రాజభవనమునకుఁ దరలిపోవుచు నామెను బిలిచిరి. ఆమెయుఁ దొందర తొందరగ వారి సమీపమున కేగి వారితోఁ గలిసి రాజభవనమునకుఁ దరలిపోయెను.

## ౫

నాఁడు చక్రవర్తియు సుందరగుప్తుఁడును నేదో సంభాషించుకొనుచుండిరి. వేసవి యధికమగుటచేఁ గొంచెము వేఁడి యెక్కువగనే యుండెను. కాని సమీపముననున్న జలయంత్రములు చిమ్ము తుంపురులచే నాపరిసరప్రదేశమంతయు వర్షము కురిసినంత చల్లగ నుండెను. అప్పుడప్పుడు చల్లని పిల్లగాలు లాతుంపురులు గొనివచ్చుచుండుటచే జల్లుకొట్టుచున్నట్లుండెను. సుందరగుప్తుఁడును జక్రవర్తియు సుఖాసనములపైఁ గూర్చుండి తీవ్రాలోచనామగ్నులై మధ్యమధ్య నేదో సంభాషించుకొనుచుండిరి. ప్రస్తుత మిరువురును గొంతసేపటివఱకును నేమియు మాట్లాడలేదు. చక్రవర్తికి సుందరగుప్తుఁడు "నాకుచేరిన వార్తలన్నియు నిందులకు వ్యతిరేకముగ నున్నవి!" అనెను.

"నీకేమి తెలిసినది!"

"కళింగమల్లుఁడెటులయినఁ గళింగమంతయు నేకీభవింపఁ జేసి మనలను బ్రతిఘటింపఁ దలఁచుచున్నాఁడు."

చక్రవర్తి దానికొక్క నవ్వునవ్వెను. ఆనవ్వు చక్రవర్తి కనుగొనలనుండి పొంగిపోవుచున్నట్లుండెను.

"మీకిది పరిహాసాస్పదముగనే కానిపించవచ్చును. కాని యాంతఁడు తీవ్రప్రయత్నములుఁ చేయుచున్న మాట నిజము!"

"ఈ కళింగకూటమిలో నెవరెవరు కలిసిరి ?"

"మహేంద్రకేసరికూటమిలో చేరినట్లు కానఁబడఁడు. మిగిలిన కళింగరాజులందఱును నాతనితో నేకీభవించినట్లే!"

"మహేంద్రకేసరి చేరకపోవుటకుఁ గారణమేమో!"

"మన మాతనికి సన్నిహితులమై యుండుటవలన మన వలన నెప్పు డేయాపద మూడునోయని యాతనికి భయముగ నున్నది. అదియునుగాక కళింగమల్లుఁడు మహేంద్రకేసరి తనయను తనకిమ్మని యడిగినట్లును దాని కాతఁ డంగీకరింప నట్లునుగూడఁ దెలిసినది."

"కారణము ?"

"కళింగమల్లుఁడు వృద్ధుఁడని"

"అపైన ?"

"దానిపై కళింగమల్లుఁడు మహేంద్రకేసరిపైఁ బగబట్టి యాతనిరాజ్యము కబళించుటకై సకల కుతంత్రములును బన్నుచున్నాఁడట"

"ఇది నిశ్చయమేనా?"

"నలుగురైదుగురు చారు లొకేవిధముగఁ జెప్పుటచే నిశ్చయమేమో యని నమ్మవలసియున్నది."

మరలఁ గొంతసేపటివఱకును జక్రవర్తి యేమియు మాట్లాడలేదు. కొంతసేపట్లేయుండి 'ప్రధానామాత్యుల నొకసారిఁ జూడవలయు' ననియెను.

"ఇప్పుడే వారిని మీసన్నిధికిఁ బంపించెదను" అనిచెప్పి సుందరగుప్తుఁ డచ్చటినుండి వెడలిపోయెను. దూరమున జల

యంత్రములుచిమ్ము తుంపురులపై బాగుగ బశ్చిమదిశ కొరిగిన సూర్యునికిరణములుపడి యింద్రధనువువలెఁబ్రకాశించుచుండెను. సార్వభౌముని నేత్రము లప్రయత్నముగ నాయింద్రధనువుపైఁబడి దానిసౌందర్య మవలోకించుచుండెను. సూర్యబింబము పశ్చిమ దిశ కొరిగినకొలఁదియు జలయంత్రము తుంపురులవలన బయలు దేఱిన యింద్రధనువు సౌందర్య మధికమగుచున్నట్లుండెను.

ఇంతలో మెల్లగ నడుగులు వేసికొనుచు సారంగపాణి యక్కడకువచ్చి సార్వభౌమునికి సవినయముగ నమస్కరించెను. సార్వభౌముఁడు సారంగపాణి వచ్చుటచూచి యొకసుఖాసనము వైపునకు తన యంగుళి నిర్దేశించెను. సారంగపాణి దానిపైఁ గూర్చుండి సార్వభౌముఁ డేమిచెప్పునోయని యెదురు చూచు చుండెను. అట్లే కొంతసేపటివఱకును నెవరును మాటలాడక పోవుటవలన వారి యిరువురిమధ్యను గొంతసేపు నిశ్శబ్ద మేర్ప డెను. తరువాత నొకింతసేపటికి చక్రవర్తి మాట్లాడెను.

"సుందరగుప్తుఁడు చారవృత్తాంతము మీకు తెలిసియే యుండుననుకొనియెదను."

"అవును తెలిసినది."

"దానిపై నేమి యాలోచించినారు?"

"పరిస్థితు లొకదారికి వచ్చువఱకును గొంతకాలము వేచియుండుట మంచిదని యనుకొనుచున్నాను."

"మనమిప్పుడు తొందరగ నొకనిశ్చయమునకువచ్చి యుద్ధ ప్రయత్నము చేయకపోయినచోఁ గళింగవ్యవహారమంతయుఁ

జిలికిబిలికి గాలివాన యగునేమోయని భయపడుచున్నాను."

"నేనావిషయము గమనింపకపోలేదు. కాని యొక విషయమున్నది. తోసలీరాజ్యము కళింగకూటమిలో చేరఁజాలదు. అనాదినుండియు తోసలికిని బిష్టపురమునకును వైరమున్నదని మీరెఱుఁగుదురుగదా !"

"కావచ్చును."

"అందుచే తోసలీరాజ్య మావిధముగ నున్నంతకాలమును గళింగకూట మేర్పడఁజాలదు. కళింగమల్లుఁడు నయమునను భయమునను తోసలీరాజ్యమును దనతోఁ గలుపుకొనఁ జూచుచున్నాఁడు. కాని యది యతనికి సాధ్యమగుటలేదు."

"అది యెట్లు తెలిసినది?"

"కళింగమల్లుఁడు తనకుఁ గొమార్తె నీయవలసినదని మహేంద్రకేసరికిఁ గబురంపినాఁడు. దాని కాతఁడు సుతరాము నంగీకరింపలేదట."

"అంతటితోఁ గళింగమల్లుఁ డూరకొన్నాఁడా !"

"లేదు. ఏదో మిషపెట్టి తోసలీరాజ్యముపై దండెత్తి దానిని కబళింపఁ జూచుచున్నాఁడు."

"అయినచో మనము వెంటనే మహేంద్రకేసరికి యభయమిచ్చి మనపక్షమునకు మరల్చుకొనుట మంచిది కాదా ?"

"దానికే నేను యుక్తసమయముకొఱకు నిరీక్షించుచున్నాను. మనము దాక్షిణాత్యరాజ్యములఁ గలతలుకలిగించు

చున్నటుల లోకమునకుఁ దోఁచినచో మనపై నందఱును నింద వేయుదురు. తోసలీరాజ్యమె మన సహాయ మర్థించినచో నప్పుడు మనపై నీ నిందయుండదు."

మరలఁ గొంతసేపటివఱకును జక్రవర్తి యేదో యాలోచించుచున్నటులు గూరుచుండెను. సారంగపాణికూడ నేమియు మాటలాడలేదు. అంతలో సుందరగుప్తుఁ డచ్చటికి వచ్చెను.

చక్రవర్తి యాతనివైపు చూచి 'యీవిషయమున సుందరగుప్తుఁ డేమనునో!' అనెను.

"క్షమింపుఁడు! నేనంతగా రాజ్యాంగవేత్తను గాను. నాపని కేవలమును యుద్ధమొనరించుటయే. మంత్రాలోచనములో మంత్రి సారంగపాణి చెప్పినదే వేదము."

చక్రవర్తి యొక్క చిఱునవ్వునవ్వి 'అయినను వారు నీయభిప్రాయ మెఱుఁగఁగోరుచున్నారు.' అనెను.

"నన్నడిగినచో మాటలాడకుండ గళింగమంతటిపై నను దండయాత్ర సలుపవలయు నందును."

"దక్షిణాపథమంతయు నేకమై తిరుగఁబడినచో?"

"దక్షిణాపథమంతయు నంతఃకలహములతోఁ గుళ్ళిపోవుచున్నది. వారిలోవా రేకీభవించుట యెన్నటికిని జరుగదు."

"తమకందఱకు నాపదవచ్చినపుడు వా రేకీభవింపవచ్చును."

"ఏకీభవింపరని నేను పందెము వేయుచున్నాను."

"ఏమిపందెము వేయుదువు సుందరగుప్తా!"

"నా రతనాలహారము!"

"అది సరియైన పందెము కాదు."

"మరియేది ?"

"దక్షిణాపథమంతయు నేకీభవించినచో కేవలము పాదచారివై యడవిపందిని వేటాడవలయును."

ఆమాటపై సారంగపాణి నవ్వుచు "బాగుగనేయున్నది. పాదచారియై యతడు డడవిపందిని వేటాడవచ్చునుగాని, దక్షిణాపథమంతయు నేకీభవించినచో మీరును, నేనును నిద్రాహారములు విడిచి యీ యాపత్తునుండి యీవలబడుటకై యాలోచింపవలసియుండును. సుందరగుప్తుడు సుఖముగ నడవిలోనికి బోయి యిటునటు దిరుగుచు నడవిపందిని వేటాడుచున్నట్లు నటించుచుండును" అనెను.

దానిపై సుందరగుప్తుడును చక్రవర్తియునుగూడ నవ్విరి. మరల గొంతసేపటివఱకును నెవరును మాటలాడలేదు. సారంగపాణి "ఇప్పుడేమిచేయుటకును వీలులేదు. దక్షిణాపథ వ్యవహారము లొకదారికి వచ్చువఱకును వేచియుండుటయె మంచిది."

చక్రవర్తి "నాకుగూడ గొంతకాలమిట్లు వేచి చూచుటయే మంచిదనిపించుచున్నది" అనెను.

ఆపిమ్మట వారిసంభాషణము రాజ్యాంగవ్యవహారములు విడిచి యనేకవిషయములపై బ్రసరించెను. క్రమముగ సాయంకాలమగుటచే నాపైన వారందఱును దమతమస్థానములకు వెడలిపోయిరి.

## ౬

ఈవేళ రాజాంతఃపురమంతయుఁ గలకలలాడుచున్నది. అందులో నాగావళి యానందమునకు మేరయే లేదు. నాగావళి వెనువెంటనే వల్లకీ వకుళాభరణ లిరువురును నున్నారు. వల్లకి శిల్పకారిణి తెచ్చిన చిత్రఫలకము లొక్కటొకటిగఁ బరిశీలించు చున్నది. నాగావళికూడ వేరువేరు చిత్రఫలకములు పరిశీలించు చున్నది. ఆరోజులలో రాజగృహములు కుడ్యచిత్రములతో నలంకరించెడువారు. కన్యాంతఃపురమున కుడ్యచిత్రము లెన్నేని యున్నవి. అయినను నంతఃపురమునఁ గన్యకలందఱును జిన్న చిన్న దారుఫలకములపై గైరికాదిధాతువులచేఁ జిత్రించిన చిత్రఫలకములు గొనుచుందురు. చిత్రములను దయారుచేసి యమ్మెడు స్త్రీల నారోజులలో శిల్పకారిణుల నెడువారు. శిల్ప కారిణి చిత్రఫలకములు గొనివచ్చినప్పుడు కన్యాంతఃపురముల నెక్కడలేని కోలాహలమును బయలుదేరెను. కన్యాంతఃపుర మున రాజబంధువుల బాలికలందఱును నెంతమూల్యములకైన లక్ష్యపెట్టక యీ చిత్రములు గొనుచుందురు.

చిన్న చిన్న దారుపలకలపై చిత్రించిన చిత్రములలో చక్కని వసంతాది ఋతుసౌందర్యమును వర్ణించు చిత్రములును, పురాణగాథ లభివర్ణించు దేవతాచిత్రములును, నాకాలమున బ్రసిద్ధులగు రాజకుమారుల చిత్రములునుగూడ నుండును.

కన్యకలు తమకిచ్చువచ్చిన చిత్రములు కొని తమ శయ్యాగార ములనలంకరించుకొనుచుందురు.

ఈనాఁడు నాగావళి పార్వతి పరమేశ్వరునికై తపమొన రించు చిత్రముఁగొన్నది. ఇంకను వర్షాకాలమున నృత్యమొన రించు 'మయూరమిధునముల' చిత్రముగూడఁ గొన్నది. తరు వాత నొకదానితో నొకటి మాటలాడుచున్నట్లున్న 'పారా వతదంపతుల' చిత్రముగూడఁ గొన్నది. ఆమూఁడు చిత్రము లను నొక చక్కని భూర్జరత్వచమునఁజుట్టి తన శయ్యాగృహ మునకుఁ గొనిపోయి దాసిచే కుడ్యమున నలంకరింపఁజేయు చుండెను. దాసి యలంకారము పూర్తియైనతరువాత తన దారిని దాను వెడలిపోయెను.

ఆమె మయూరమిధునమువైపట్టేచూచుచుండెను. అవి రెండును నొకే నృత్యములో లగ్నమైనట్లుండెను. అవి రెండైన ను లయాత్మకములగు రేఖలలో నొకేవిధముగఁ గన్పట్టు చుండెను. వివిధములగు చిత్రవర్ణములతోఁ దళతళ మెఱసి పోవుచున్న యా నెమిళ్ళజంటవైపు రెప్పవేయకుండఁ జూచు చున్న యామెకెవరో వెనుకనుండివచ్చి యొక్కసారిగఁ గను మూసినట్లయ్యెను.

నాగావళి యెంతసేపటికిని దన కనులుమూసినదియెవరో తెలిసికొనలేకపోయెను. ఎన్నో పేరులు చెప్పినతరువాత నామె 'వకుళాభరణ' అనెను.

"కాదు!"

"మఱి నేను చెప్పుకొనలేను"

"చెప్పుకొననిచో విడిచిపెట్టునదిలేదు"

"వల్లకి"

"అమ్మా! చెప్పుకొన్నావే!" యనిచెప్పి వల్లకి యామె చేతులు విడిచెను.

"నీవనుకొనలేదే! నీవిక్కడ కెప్పుడువచ్చితివే! వల్లకీ!"

"అల్లెవరువచ్చినను గుర్తింపలేనంత మైకములో నీవా చిత్తరువులో నేమి పరీక్షించుచున్నావు?"

"ఏమి! ఆచిత్తరువు సొగసుగ లేదా? వల్లకీ!"

"మొత్తముమీఁదఁ జిత్తరువు బాగుగ నేయున్నదిగాని, యంతగ మైమఱపించుచక్కదనమేమో నాకుబోధపడుటలేదు"

"ఆ నెమిళ్ళజంట రంగులలో చిత్రకారు డవి రెండును నొకదానిలో నొకటి కలసిపోవుచున్నట్లు చిత్రింపలేదా?"

"నాకళ్ళకవి సొగసుగనేయున్నవిగాని, యొకదాని వర్ణములో నొకటి కలసికొనుట యేమో బాగుగ బోధపడ లేదు."

"అవునులే! నీ వెప్పుడును చిత్రకువులనుగుఱించి యిట్లే మాటలాడుచుందువు. ఇట్లు వంకరగ మాటలాడుట నీకు జిన్నప్పటినుండియు నలవాటే!"

"అదికాదు నాగావళీ! నాకు నీవు చెప్పినది యేదో బోధపడలేదు! కొంచెము తెలియఁజెప్పకూడదా!"

"తెలిసియుఁ దెలియనట్లు నటించువారికి బోధించుట బ్రహ్మకైనను దరము కాదు!"

ఈమాట లన్నతరువాత వల్లకి యొక్కనవ్వు నవ్వినది. ఆతరువాత నామె తన పెటలోనుండి యొకచిత్తరువుతీసి చూపించుచు 'మఱి చిత్తరువులు పరీక్షించుటలో మిగుల నేర్పఱివి. ఈచిత్తరు వంతకన్న బాగున్నదో లేదో చెప్పుము !" అనెను.

అప్పుడు నాగావళి యాచిత్తరువుపైనున్న భూర్జపత్రము తొలగించి, దానివైపు తెప్పవాల్చక చూడసాగెను.

వల్లకి యామె ముఖవైఖరి పరీక్షించి చిఱునవ్వు నవ్వుచు "ఈరెండింటిలో నిది బాగున్నదా ? లేదా ?" అనెను.

"ఇది ఎవరో రాజకుమారుని యాకృతిచిత్రము. దీనికిని దానికిని పోలిక యెట్లువచ్చును?"

"ఇది చిత్రించిన చిత్రకారు( డెవరో చాల నేర్పరివలెనున్నా(డు".

"నీకా రాజకుమారు( డెవరో తెలియునా?"

"తెలియదు. ఎవరు?"

"తెలియదా! సరి! తెలిసినదిలే! నీవుకూడ నాదగ్గఱ తెలిసియు( దెలియనట్లు నటించుచున్నావులే!"

"కాదు! వల్లకీ! నాకు నిజముగ( దెలియదు!"

"నిజముగానే!"

"నిజముగానే"

"అయినచోఁ జెప్పెదను వినుము. ఇదివిని నీవు చాల నాశ్చర్యపడెదవుసుమా!"

"పడనులే"

"ఇది యశోకచక్రవర్తి రూపచిత్రము"

"అశోకచక్రవర్తి రూపచిత్రమా!"

ఈమాటలన్నతరువాత నాగావళి మఱి మాటాడలేదు. తదేకదృష్టితో నాచిత్రమువైపే చూడసాగినది. వల్లకిగూడఁ జిఱునవ్వులు నవ్వుకొనుచు నాచిత్రము వైపును, నాగావళి ముఖమువైపును జూడసాగినది. కొంతసేపయినతరువాత నాగావళి "వల్లకీ! ఈచిత్రమెవరుకొన్నారే?" యని యడిగెను.

"నేనేకొన్నాను! ఏమి నీకుఁ గావలయునా?"

"అందులకుఁగాదు! ఊరక వృత్తాంతము తెలిసికొనుట కడిగితిని"

"నీ వెందులకడిగితివో నాకు తెలిసినదిలే!"

దీనితో నాగావళి కపోలము లెఱ్ఱవడెను. ఆమె వల్లకివైపు చుఱచుఱ చూచి "నీ కేమి తెలిసినదే?" అనెను.

"నీకీచిత్రము కావలెనని!"

"నాకక్కఱలేదు. నీ వెప్పుడును నీవిధముగనే మాట్లాడుచుందువు!" అని పలికి యాచిత్ర మామె వల్లకియొడిలో పడవైచెను. ఆపైన వల్లకి నిజముగఁ గావలసినవా రీవిధముగ మాట్లాడి యీవిధముగనే నటించుచుందురు" అనెను.

"చాలులే, మాటలు బాగుగ నేర్చితివి".

"ఎందుకే యింతకోపము. నాగావళీ! ఇంతకును నే నేమన్నానని!"

"మాటలు మాటలలాగుండవలయునుగాని యివి యేమి వేళాకోళములు!"

"ఊరక పరిహాసమునకన్న నింతకోపమెందులకమ్మా!" ఈమాటలన్న తరువాత నాగావళి కోంచెము శాంతించెను. మఱల వల్లకి 'నాగావళీ! ఈచిత్తరువు నీకు బహుమతిగా నీయవలయునని కొని తెచ్చితిని! స్వీకరింపవా?' అనెను.

"నాకక్కఱలేదు."

"ఇంక కోపము చాలింపుము. పట్టినపట్టునకింక విడువుండ నక్కఱలేదా!"

అటుతరువాత వల్లకి నాగావళి బుజముపై చెయ్యివేసి యెన్నోవిధముల బతిమాలెను. నాగావళి మఱికొంత సేపటికి ప్రసన్నముఖియై చిఱునవ్వుతో 'అట్లే తీసికొందునులే' అనెను.

అటుపిమ్మటఁ గొంత సేపటివఱకును వా రిరువురును ననేక విషయములనుగూర్చి మాట్లాడుకొనిరి. పిమ్మట వల్లకి బాగుగఁ జీఁకటిపడుటచేఁ దనగృహమునకు వెడలిపోయినది. తరువాత నాగావళికూడ తన శయ్యాగారమున కేఁగి మెత్తని పాన్పుపై శయనించెను. ఆమె కెంతసేపటికిని కునుకు రాలేదు. ఆమె 'తనమూలమునఁ దండ్రికి మనోవ్యాకులత సంభవించెను గదా!' యని విచారపడఁజొచ్చెను. ఎటుచూచినను దమ

రాజ్యమునకు ముందుఁబోయిన నూయి, వెనుకకేఁగిన గోయి అనునట్లున్నది. అటు కళింగమల్లునికిఁ గోపమువచ్చినను, ఇటు అశోకచక్రవర్తికిఁ గోపమువచ్చినను దమ కపాయమె. కాని యెంతరాజ్యాశ యున్నను నశోకచక్రవర్తి కళింగమల్లుఁ డంత దుర్మార్గుఁడుగాఁడు. అయినచోఁ దమవా రశోకునిరక్షణ యేల యాచింపరు! ఏమో! కళింగమల్లుఁడు హఠాత్తుగఁ బైబడి రాజ్యమాక్రమించినచో! అప్పు డశోకచక్రవర్తి తన సామ్రాజ్య రక్షణకైనఁ దమకు సాయము చేసితీరును.

ఈవిధముగ నశోకుని దమకు రక్షకునిగ భావించుటవలన నాగావళి కాతనిపై నొకవిధమగు నాసక్తి బయలుదేఱెను. అందుచే నామె దంతపేటికలో భద్రపఱచిన యశోకుని చిత్రఫలకము పైకిఁదీసి జాగ్రత్తగఁ బరిశీలింపసాగినది. చక్రవర్తి నిజముగఁ జాలసౌందర్యవంతుఁడు! విశాలములగు నేత్రములలో నెంతటి వెలుగున్నది! ఎంతవిశాలమైన కరుణ జాలువాఱు చున్నది! నిజముగఁ దానా దయాసముద్రుని వివాహమాడఁ గలిగియుండినచో నెంతబాగుండెడిది! ఏమో! అంతటి యదృష్టము తనకుఁ బట్టునా! అట్లాలోచించుచుండ నప్రయత్న ముగ నామె చెక్కులనుండి రెండు వేడివేడి కన్నీటిబిందువులు నేలపై వ్రాలెను. ఆమె చిత్రఫలకము శయ్యపైఁ బెట్టి కొన గోటితోఁ గన్నీరు తుడిచికొన్నది.

చిత్రఫలకము శయ్యపైఁ బెట్టినను గూడఁ నామెకెదురుగ నశోకునిమూర్తి కానిపించుచునే యుండెను. ఆమె తదేక

దృష్టితో నటులే యశోకునివైపు నిరీక్షింపసాగినది. అట్లు చూచుచుండుటవలనఁ గొంత సేపటికా మెకు నిద్రపట్టినది. ఆనిద్ర గాఢమైనకొలఁదియు నామెకొక కలవచ్చినది.

ఆకలలో నామె యొకయడవిలో చిక్కుకొన్నది. ఎటు జూచినను సాంద్రారణ్యము. అంతయు జీబూతముగ నున్నది. ఆమె కాయరణ్యములోనుండుటకు భయమునిపించెను. ఏపెద్దపులి యైనను నమాంతముగఁ దనమీఁదఁబడి తన్ను మ్రింగివేసినచో! ఇంకేమున్నది! సరిగ నామె యనుకొన్నట్లే జరిగినది! ఒకపెద్ద పులి 'గాంఢ్రుగాంఢ్రు' మని యరచుచుఁ దనమీఁదికి వచ్చు చున్నది. ఆమె పట్టరాని భయముతోఁ గాలికొలఁదిగఁ బరువె త్తసాగినది. పెద్దపులికూడ నంతకంటె వేగముగాఁ దనపై కురుకు చున్నది. ఆమె చివరకొక్కగుక్కతో గడువడిగఁ బరువెత్తినది! కాని ఆమె యింకఁ బరువెత్తలేక భయముతో నొక్కసారిగ నేలపైఁ గూలఁబడి పోయినది! ఆక్రూరజంతువు వచ్చి, తనమెడ పట్టుకొన్నది. అపై నామె స్పృహతప్పి పడిపోయినది.

చాలసేపటివఱకును నామెకు మెలఁకువ వచ్చినట్లులేదు. మెలఁకువ వచ్చిన తరువాత నామెకుఁ దన్నెవ్వరో యొడిలోఁ బెట్టుకొని తనకుఁ బరిచర్య చేయుచున్నట్లు తోచెను! ఆమె కన్నులు తెరచిచూచినది. తరువాత నామె తనకన్నులే నమ్మ లేకపోయినది! అట్లు తననావిధముగఁ బెద్దపులి బారి బడకుండ రక్షించినవాఁ డశోకచక్రవర్తి! తటాలున నామె పరపురుషుని యొడిలో విశ్రమించినందులకు సిగ్గుపడుచు లేచి కూరుచుండెను.

వెంటనే యామెకుఁ దెలివివచ్చినది. తనకు వచ్చిన కల తలచుకొనినకొలఁదియు నామె కపోలము లెఱ్ఱపడసాగెను. అశోకదర్శనమున నానందము కలిగినను నామెకు వ్యాఘ్రి దర్శనమువల్ల నేమైన నశుభ మాపాదిల్లునేమోయని భయము కలిగినది. మఱల నామె దుస్స్వప్న నివారణకై యేవో స్తోత్రములు పఠించుచు మెల్లగ నిద్రపోయినది.

## ౭

నాగవర్మ తిరిగి వచ్చినప్పటినుండియు కళింగమల్లునికి మహేంద్రకేసరిపై పట్టరాని క్రోధముదయించెను. ఆతనిని దన పాదాక్రాంతునిగ నొనర్చుకొని యాతఁడు తనకాళ్ళమీఁదపడి క్షమాభిక్ష వేఁడునటులచేయవలయును. అంతవఱకును నాతనికిఁ దిన్నగ నాహారముకూడ సయించుట మానివేసెను. ఆతఁడు తన బలములన్నియు నొక్కొక్కటిగ బాగుగ నభివృద్ధిపరుపసాగెను. పిష్టపురముననున్న కోటగూడ బాగుగ నభివృద్ధిపఱచి తనబలములన్నియు జాగ్రత్తగఁ బరిశీలించుచు రాజ్యాంగము లన్నియుఁ దానే స్వయముగఁ బరిశీలించుచు నతి జాగరూకతతో వ్యవహరించుచుండెను.

అప్పుడే వేసవివెళ్ళి వర్షాకాలము ప్రారంభించినది. కళింగమల్లుఁ డొంటరిగఁ గూరుచుండియుండెను. దూరములో

నల్లని మేఘములు కుప్పలు కుప్పలుగ నొకచోఁ జేరినవి. అప్పు డప్పుడు చిటపట చినుకులు పడుచుండుటచే నెప్పుడో యొక ప్పుడు హఠాత్తుగ ధారావర్షము కురిసియునేమోయని యనుమాన ముగ నుండెను. ఆకసమునఁ దూనీగలన్నియు బాణములవలె నిటునటు నెగురుచున్నవి. అప్పుడప్పుడు బాటలపై నాకా శమువఱకు ధూళి లేచుచు మేఘములవలె నెగిరిపోవుచుండెను.

కళింగమల్లుఁడు ముంచుకొనివచ్చుచున్న యావర్ష మేఘ ములవైపు పరీక్షించుచుండెను. ఇంతలో తళుక్కుమని యొక మెరుపు మెరిసెను. ఆమెఱుపు తళతళలో నాతనికిఁ దన ప్రక్కనే కూరుచున్న నాగవర్మ కానవచ్చెను. కళింగమల్లుఁ డింతవఱకును నాగవర్మ తన ప్రక్కనున్నాఁడను విషయము గుర్తించనే లేకపోయెను. నాగవర్మకూడ మెల్లగఁ దనప్రక్క చేరి కూర్చున్నాఁడే కాని యేమియు మాటలాడనే లేదు.

"నీ వింతవఱకును నిచ్చటఁ గూరుచున్న విషయమే గుర్తింపలేక పోయితిని."

"నేనును నిప్పుడిప్పుడే వచ్చితిని. మీ రేదో ధ్యాన నిమగ్నులయి యుండుటచే మీధ్యానమునకు విఘ్నము చేయుట కిచ్ఛగింపక యీవిధముగఁ గూరుచుంటిని."

"తోసలీనర్తమాన మేమైన తెలిసినదా?"

"తెలియుటకేమున్నది. మన మీవిషయమున నంతగఁ బట్టుదల వహించుట మంచిదికాదు."

"నాకు మీారనుమాట తిన్నగ బోధపడలేదు."

"ఆజ్ఞయైనచో నున్నవిషయము లున్నయటులు చెప్పెదను. నాతప్పిదమేమైన క్షమింపవలసియుండును."

"కానిండు?"

"మీారు మహేంద్ర కేసరిని బలప్రయోగముతో భయపెట్టినచోఁ జిలికి చిలికి గాలివాన కావచ్చును."

"అనగా?"

"ఇంతకంటె వివరింపవలసిన యవసరమేమున్నది. అశోక చక్రవర్తి యాతనికి సహాయముగ సేనలనంపినచో మనమేమి చేయఁగలము?"

"చక్రవర్తి సేనలు వచ్చువఱకును నిచ్చటితోనలీయుద్ధమిటులే జరుగుచుండు ననియా మీాయూహ!"

"ఏమో నాయభిప్రాయము నేను మనవిచేసినాను. ఆపై మీాచిత్తము."

"ఏమైనను నిది యీా విధముగఁ జరిగితీరవలసినదే!"

"కాని యూరక ముందుగ మనము వారిపై దండెత్తితి మనుమాట మనపైఁ బడరాదు."

"ఇది యొక పెద్ద యుపాంతరాయముగఁ జెప్పినచో నేనేమి చెప్పఁగలను!"

ఆమాటపై నాగవర్మ కొంతసేపటివఱకును నేమియు ననలేదు. కొంతసేపుండి "నాదొక మనవియున్నది! తాము సావధానముగఁ జిత్తగింపవలెను" అనియెను.

దానిపై( గళింగమల్లు(డు మీరేదో చెప్పెద మనుటయే గాని, యొక్క మాటయు( జెప్పుట గాన(బడదు!" అనెను.

నాగవర్మ యేమియు( జలింపకుండ "ఇదిగో! చెప్పు చున్నాను. నేను చాలకాలమునుండియు మీకొలువుచేసితిని. నాకువార్ధకభారము పై(బడుచున్నది. నేనిక నిట్టి వ్యవహారములు నిర్వహింప(జాలను. నాకు శీఘ్రముగ వారణాసికి( బోవలయుననియున్నది. కావున నాకు వెంటనే యనుమతి దయచేయు(డు!" అనియెను.

"ఏమి, మీరీవిషయమున నింతగభయపడుచున్నారు?"

"నేనిది నాప్రాణములపై దీపితో( జెప్పినమాటకాదు. ఉభయరాజ్యములలోను వేలాదివేలుగ( బ్రజానష్టము గలుగు ననియే నాభయము!"

"అమాత్యవర్యా! మీరనవసరముగ నేమేమియో జరుగునని భయపడి పోవుచున్నారు. మనము పూర్తిగ యుద్ధ సన్నాహములు చేసితిమనుసరికి మహేంద్రకేసరి మనకు( బాదాక్రాంతు( డయితీరును! నామాట విశ్వసింపు(డు!"

నాగవర్మ మఱల( గొంతిసేపటివఱకును నేమియు మాటలాడలేదు. మఱల( గళింగమల్లు(డందుకొని "మన మీవిషయమున నీవిధముగ సందేహించుచున్నచో నన్నియు ననుమానములే! సాహసించి ముందుకురికినచో నన్నిపనులును వాని యంతటనవియే చక్క(బడిపోవును!" అనియెను.

నాగవర్మ "నేను మీరు చెప్పునది కాదని యనను. ఒక వేళ మీరు చెప్పినయట్లుగఁగూడ జరుగవచ్చునని యను కొందును. కాని—" అని చెప్పి యూరకుండెను. కళింగమల్లుఁడు "మీ రేమియు ననుమానింపకుఁడు! నేను చెప్పినవిధముగ వ్యవహారము నడపింపుఁడు! తోసలీజైత్రయాత్ర యయినతరువాత మీరు వారణాసికిఁ బోవచ్చును. మిమ్ముల నిఁక నడ్డుపెట్టఁదలచుకోలేదు" అనియెను.

నాగవర్మ యూపైఁ గొంతసేపటివఱకును నేమియు మాట్లాడకుండ నూరకుండి "సరే! మీచిత్తమెట్లో అట్లే చేసెదను!" అని మెల్లమెల్లగ నటనుండి వెడలిపోయెను. అతఁడు వెడలిపోయినతరువాత తళతళ మెఱపులు మెరసి కుంభవృష్టిగ వర్షము కురియసాగెను. కళింగమల్లుఁడు చాలసేపటివఱకును నావర్షమువై పట్లే చూచుచుఁ గూరుచుండెను.

౮

నేఁడు నాగావళివైఖరి యేమియు బాగుగాలేదు. ఈమధ్య నామె యెంతో శుష్కించిపోయినది. నేఁడామెనుజూచినచో నడచుటకుఁగూడ శక్తిలేనిదానివలె గానుపించినది. నేఁడు ప్రకృతికూడ లోలోపలఁ గుమిలిపోవుచు నేడ్చుచున్నట్లుండెను.

వాన కుంభవృష్టిగఁ గురియుట మానివేసి యుదేపనిగ తుంప రలు తుంపరలుగఁ గురియసాగెను. ఉదయ మొకజాముప్రొద్దెక్కినది. కాని నిశ్శబ్దముగఁ బడుచున్న యీ వానతుంపరలు, స్తబ్ధముగ నొకేచోట గుమిగూడియున్న నల్లనిమబ్బులను, నిండ్లపైనుండి మెల్లగఁ బైకెగయుచున్న ధూమమాలికలను జూచువారికిది సాయంకాలమనిపించుచుండెను. తోసలీనగర మున రాజప్రాసాదమునకు సమీపముననున్న యిండ్లపై కాకులు తమరెక్కలు విదిలించుకొనుచు నప్పుడప్పుడు 'కాకా' యని కూయుచుండెను. రాజప్రాసాదములోని పారావతము లన్నియుఁ దమగూళ్ళలోఁ జేరి మంద్ర మంద్రముగఁ గూయు చుండెను.

నాగావళి తన ప్రాసాదమునఁ గూరుచుండి యీ ప్రాతః కాలవర్షమువైపు పరికించుచుండెను. ఆమె యీవర్షమువైపు చూచుచున్నదన్నమాటేగాని ఆమె హృదయము మాత్రము మరియొక విషయమునుగూర్చి మిగుల నాందోళనపడు చుండెను.

కళింగమల్లుని సైన్యములు ప్రతిదినమును దోసలీరాజ్య మునఁబడి దోచుకొనుచున్నవి. పాపము! తోసలీరాజ్యము నకును బిష్టపురరాజ్యమునకును సరిహద్దులలోనున్న ప్రజలు భయభ్రాంతులై తమతమ కుటుంబములతోఁ దోసలీనగరము నకు వచ్చివేయుచున్నారు. నాగావళి తండ్రికి యుద్ధముతప్ప

గత్యంతరము కానరాలేదు. కాని యాతఁడు తానుకూడఁ బ్రత్యక్షముగ యుద్ధములోనికి దిగినచో నత్యధికముగఁ బ్రజాక్షయము సంభవించునని భయపడుచుండెను. కాని యేక్షణముననే యుపద్రవము వచ్చునోయని యందఱును భయభ్రాంతులగుచుండిరి.

ప్రతిదినమును వేలాదివేలుగఁ బ్రజలు పడుచున్న యమయాతనలన్నియు రాజధానిలోనున్నవారికిఁ జేరుచుండెను. మహేంద్రకేసరి యీ దురంతములు విని యేమియుఁ జేయఁజాలని నిస్సహాయస్థితిలోనుండెను. పైకి చెప్పకపోయినను బ్రజలకందఱికి రాజకుమార్తె వివాహమే దీనికిఁ గారణమని తెలియును. నాగావళికిఁ "దా నీ ప్రజల కష్టములకన్నిటికిని గారణమైతిని గదా!" యని లోలోపల నెంతో బాధగనుండెను.

వర్షమట్లే కురియుచున్నది. నాగావళి యీ యాపద నుండి తన తలిదండ్రులెట్లు బయలుపడఁగలరో యని బెంగఁగొని యుండెను. అట్లాలోచించుచుండగ నామెకు తన దంతపేటికలో నున్న యశోకుని చిత్తరువు జ్ఞాపకమువచ్చినది. నిజముగఁ జక్రవర్తియే తన సైన్యములతో వచ్చి తనతండ్రికిఁ దోడుగ నిలిచి తన్ను నాపదనుండి యుద్ధరించినచో! అదియెట్లు జరుగును! తానూరక గాలిలో మేడలుగట్టుకొనుచున్నది! ఆవిధముగఁ దలఁచుకొనుచుఁడ నామె చెక్కిళులనుండి యప్రయత్నముగఁ గన్నీరు ప్రవహింపసాగెను.

ఇంతలో వర్షముకొంచెము వెలిసి చినుకులు పడుట మానివేసెను. దూరమున నిళ్ళపై నొదిగియున్న పక్షులు రెక్కలు విదిలించి శ్రవణ మనోహరముగఁ గూయుచుఁ దమ గృహములకు వెడలిపోవుచుండెను. నాగావళి మనసేమియు నీ ప్రకృతిపరిణామము గ్రహించుపరిస్థితిలో లేదు. ఇంతలో నెవరో వచ్చి యామెకుఁ దనకన్నులు మూసినట్లయ్యెను. ఆమె యొక్కసారిగ తన గాఢాలోచనలోనుండి మేలుకొనినది.

'ఎవరువారు? '

'.........'

'వకుళాధరణి'

'          '

'వల్లకి!'

వల్లకి యామెకనులకుఁ గప్పిన చేతులు తీసివేసి పకపక నవ్వుచు నామె కెదురుగ నిలువఁబడెను. నాగావళి వల్లకి తన కన్నీటిబిందువులు చూచి యదేమని ప్రశ్నించునేమో యని మొగము తుడుచుకొను వంకతోఁ గన్నీటిబిందువులు కనపడకుండఁ దుడిచివేయుచుండెను, కాని వల్లకి యావిషయ మొక నిముసములోఁ గనిపెట్టివేసెను.

'అదియేమే నాగావళీ అట్లున్నావు?'

'ఏమియునులేదే!'

'పోనీలే నాదగ్గర దాచుచున్నావా?'

'లేదు వల్లకీ! నాకు నీదగ్గర దాచుట కేమున్నది!'

'మరి నీముఖమట్లున్న దేమి?'

'ఏమియు లేదు. గాలి కేదో నలక యెగిరివచ్చి కన్నులలో( బడినది'

ఆపిమ్మట వల్లకి నాగావళి రెండుచేతులను బట్టుకొని యెంతో స్నేహబలముతో బతిమాలసాగెను. కొంతసేపగునటికి నాగావళి చిఱునవ్వు నవ్వుచు 'ఏమియునులేదు వల్లకీ! ప్రజలు చెప్పుకొను యుద్ధవార్తలనుబట్టి యెప్పుడేమి మూడునో యని భయపడుచున్నాను. తుదకదియంతయు నామూలమున నేర్పడినదికదా యని కొంచెము కించగానున్నది. అంతకన్న నేమియు లేదు!' అనెను.

అపై వల్లకి 'దీనికా నీవింత భయపడుచున్నావు! అయిన నీవీ క్రొత్తవిశేషము వినలేదా! అనెను.

"వినలేదు. అదియేమో చెప్పుము వల్లకీ!"

"నేనుమాత్రమంత తేలికగా( జెప్పెదననుకొన్నావా! చెప్పినచో నాకేమిచ్చెదవు!"

"అది నాకు సంబంధించిన దేనా:"

"కేవలమును నీ వివాహమునకు సంబంధించినది!'

ఈమాటపై నాగావళి కించుక సిగ్గుపొడమెను.

"వట్టిది! నీవూరక యిట్లు కల్పించుచున్నావు!"

"పోనీ! నాలుగైదు దినములలో సత్యాసత్యములు నీకే

నాగావళి మాఱుపలుకలేదు! ఆమె కడుగవలయునని యున్నది. కాని యడుగుటకుఁ గావలసినంత ధైర్యములేదు. అట్లే వల్లకి ముఖమువైపుచూచుచు నూరకుండెను. వల్లకి యామెవైపు చూచుచు నూరక ముసి ముసి నవ్వులు నవ్వుచుండెను. ఎంతసేపటికిని నాగావళి మాఱుపలుకలేదు. వల్లకియే తుదకు 'చెప్పమందువా!' అనెను.

"అక్కఱలేదులే!"

కాని వల్లకి యూరకొనియుండలేకపోయెను. మెల్లఁగ నాగావళి నకుఁజేర్చుకొని యామె వలదని యనుచున్నను జెవిలో నేమేమో చెప్పివైచెను.

నాగావళి కొంచెము సేపూరకుండి 'నిజముగనే' అనెను.

'ఎంతయొట్టు పెట్టుకొమ్మనిన నంతయొట్టు'

నాగావళికిఁ బట్టరాని యానందము కలిగెను. అయినను నామె యానంతోషము పైకిఁ గనఁబడనీయకుండ నుండవలయునని ప్రయత్నించెను. కాని యామె యానందము చిఱునవ్వుల లోను, కనుగొలుకులలోను, గపోలములపైనను వెన్నెలవలె వెల్లివిరియుచుండెను. కొంచెము సేపున్న తరువాత నామె 'నీకిది యెవరు చెప్పిరి వల్లకీ!' అనెను.

"వకుళాభరణ!"

దీనిపైనిఁక నాగావళికి దీని యాథార్థ్యము విషయమై శంకింప నవసరము లేకపోయెను. పట్టరానిసంతోషముతో నామె పసిపాపవలె లోలో నానందించెను.

## ౯

తోసలీనగరమంతయు నేఁడల్లకల్లోలముగ నుండెను. ఆనాఁడు జనసమూహముల ముఖములలో నెక్కడఁజూచినను భయమును, సందేహము తాండవించుచుండెను. నగరమున నెక్కడ జూచినను నాశ్వికులును బదాతులును విల్లమ్ములను కరవాలములను ధరించిపోవుచుండిరి. వీథులలో నెక్కడఁజూచినను సైనికులే కానవచ్చుచుండిరి. ఆరోజులలో దండెత్తివచ్చిన సైన్యములు ప్రజలను బాధించుటగాని, దోఁచుకొనుటగాని సామాన్యముగ జరిగెడిది కాదు. అందును బోరాడు పక్షముల నారిరువురును నార్యధర్మమే యవలంబించువారైనచో నీమర్యాదలు చాల జాగ్రత్తగఁ బరిపాలించెడువారు. అయినను నగరమున ధనవంతులును రాజబంధువులును గొంతమంది క్షేమంకరములగు ప్రదేశములలోఁ దమకుటుంబములను సురక్షితముగ నుండున ట్లేర్పాటులు గావించుకొనుచుండెడువారు.

సామాన్యప్రజ లెక్కడకుఁ బోఁగలరు! వారు తమకుఁ దోఁచినవిధముగ నాత్మసంరక్షణ మొనర్చుకొనుచుండెడివారు. నేఁడు పదాతిసైన్యములనున్న యోధులందఱికిని యుద్ధమునకు సిద్ధముగ నుండవలసినదని దండోరా వేయఁబడెను. రాజులిచ్చిన మాన్యములననుభవించుచుండిన యోధులందఱును నాదండోరా వినినతోడనే తమయోధవేషములను దగిలించుకొని యుద్ధమునకుఁ బోవుచుండిరి.

తోసలీనగరమునకుఁ జేరనున్న యొకసామాన్యగృహములో నొక యోధుఁడావిధముగనే యోధవేషమువైచుకొని యుద్ధమునకై సన్నద్ధుఁడగుచుండెను. ఆగృహములో నొక విధముగ నిశ్శబ్దము వ్యాపించియుండెను. ఆకాశమున నలువైపులను సన్నని మేఘములు వ్యాపించుటచే సూర్యకాంతి ప్రత్యక్షముగ నేలపైఁబడక మేఘయవనికలపైఁబడి యూపై నేలమీఁదఁబడుచుండెను. అందుచే నొకవిధముగ నుక్కపోయుచున్నట్లుండి, భూమ్యాకాశములు రెండును నేదో తీవ్రాలోచనలో మునిగినటులుండెను. సూర్యుఁడు నడినెత్తిమీఁదనుండి బాగుగఁ బశ్చిమమున కొరగినటులఁ గానుపించుచుండెను. వానవచ్చునను నాశచేఁగాఁబోలు నొకటి రెండు తూనీగ లటునిటు నెగురుచుండెను. దూరమున గుఱ్ఱములపై సవారిచేయుచుఁ బోవుచున్న సైనికుల యుత్సాహసూచకములగు 'జయజయ' ధ్వనులలో నాయశ్వముల డెక్కలచప్పుడు లస్పష్టముగ వినవచ్చుచుండెను. మఱియొకవైపున నేనుగుల ఘీంకారములును, యోధుల పాదధ్వనులును వినవచ్చుచుండెను.

ఆ యోధుఁ డేమియుఁ జలింపకుండ నెమ్మదిగ తనవేషము ముగించుకొనుచుండెను. ఇంతలో నేవో భక్ష్యము లాతని జనని కొనివచ్చి యాతని కొకమూటగట్టి యిచ్చినది. ఆమెకు డెబ్బది యేండ్లుండవచ్చును. శరీరము కొంచెమువంగినది. తలయంతయు ముగ్గుబుట్టయైపోయెను. కనులలో నింకను గొంచెము దగ్గఱగ

నున్న వస్తువులనుజూచి యానవాలుపట్టు శక్తియున్నది. ఆమె కైదుగురు సంతానము. వారిలో మొదటి ముప్వురు చిన్నతనము లోనే మరణించిరి. నాలుగవసంతాన మొకకొమార్తె. ఆమె కిరువురాడుపిల్లలు కలిగినతరువాత కొంత నడిమివయస్సుననే మర ణించినది. ఆయాడుపిల్లల కిరువురకును బెండ్లిండ్లుచేసి యత్తవారి యిండ్లకుఁ బంపివేసినది. యోధవృత్తిలోనున్నవాఁడందఱికం టెను గడఁగొట్టువాఁడు. ఈతఁడాడుబిడ్డకలిగిన చాలకాలమునకు గానిజన్మింపలేదు. ఈతఁడనిన తల్లికి సహజముగఁ బ్రేమఎక్కువ. ఈతని కిప్పుడించుమించుగ నిరువదియైదేండ్లున్నవి. ఈయోధున కీమధ్యనే కొన్నిసంబంధములుకూడ వచ్చినవి. అవి యంతగా నామెకు నచ్చకపోవుటచే వివాహము జరుగలేదు. ఏదియో యొకసంబంధముచూచి శీఘ్రముగనే వివాహము చేయవలయు నని యనుకొనుచున్నది.

ఇంతలోనే తోసలీనగరముపైఁ గళింగమల్లుఁడు దండెత్తి రానున్నాఁడని వార్తలు నగరమంతయు వ్యాపింపసాగెను. ఆవార్తలు వినుచున్నకొలఁదియు నావృద్ధజనని హృదయ మనేక విధములఁ గంపింపఁసాగెను. అనుకొన్నట్లే యయినది. చివఱకుఁ దోసలీరాజ్యమునకును బిష్టపురరాజ్యమునకును యుద్ధము స్థిర పడిపోయినది. ఉభయరాజ్యములలోని యోధులకు యుద్ధము నకు సిద్ధముగ నుండవలసినదని డఁడోరాలు వేయించఁబడినవి. పాప మావృద్ధురాలి కీవార్తవినఁగనే పంచప్రాణములును

నొక్కసారిగఁ బై కెగిరిపోయినవి. చివరికిఁ దన యాశలన్నియు నడుగంటిపోయినవి! ఆతఁడీసాయంకాలమె యుద్ధరంగమునకుఁ బోవుచున్నాఁడు !

కుమారుఁడు ప్రయాణసన్నాహము ముగించుకొని తల్లి పాదములకు నమస్కరింపఁబోయినాఁడు. పెద్దల యాచారము చొప్పున జనని యుద్ధమునకుఁబోవు కుమారుని జిఱునవ్వుతో 'విజయీభవ' యని యాశీర్వదింపవలయును. ఆమె ధైర్యముగ నట్లేయాతనిని జిఱునవ్వుతో 'విజయీభవ' యని యాశీర్వదించినది. కాని యా మఱునిమేషముననే యొక్కసారిగఁజాపచుట్టగ నేలపైఁగూలఁబడిపోయినది. అదిచూచి యాకుమారయోధుఁడామెకుచితరీతుల శీతలోపచారములొనర్చి సేద దేర్చెను. పాపమామె లోపలినుండి పొంగిపొంగివచ్చుచున్న దుఃఖావేశ మాపుకొనవలెనని తన శక్తి యున్నంతవఱకును బ్రయత్నించినది. ఆ యాశీర్వచన క్షణమున నెట్లెట్లో యాప్రయత్నమునఁ గృతకృత్యురాలైనది. కాని యుత్తరక్షణముననే మనశ్శరీర దౌర్బల్యమువలన నొక్కసారిగ నేలపైఁ గూలఁబడిపోయినది.

కుమారుఁడు సేద దేర్చిన తరువాత నామె యాతని వైపొక నిముసమువఱకును వెఱ్ఱిదానివలెఁ జూచినది. కాని యా యుత్తరక్షణముననే యాతనిని గౌఁగిలించుకొని చెక్కులు నిమురుచు బావురుమని యొక బాలికవలె నేడువసాగెను. ఎంతసేపాతఁడోదార్చినను లాభములేకపోయెను. చివఱకుఁ బ్రయాణ

సమయమున నేడువకూడదను నమ్మక మొకటియె యామె నొకించుక ప్రశాంతురాలిగ నొనర్చినది.

ఆతరువాత నామె యాతని కెన్నో యుపదేశవాక్యములు పలికినది. అవియన్నియు నాతఁడొక పసిపాపనివలె నాలకించెను. ఆమె చెప్పినమాటలే మఱలఁ జెప్పినది. మఱలమఱలఁ జాగ్రత్తగ నుండవలయునని పలికినది. అవియన్నియు నయినతరువాత మఱల నాతఁడామె పాదములకు సభక్తికముగఁ బ్రణమిల్లినాఁడు. ఆమె యాతని నొకసారిగఁ దనివిదీర నక్కునఁజేర్చుకొని పసిపాపని ముద్దాడునట్లు ముఖమంతయు ముద్దులు పెట్టుకొన్నది. తరువాత నాతఁ డామె నెట్లోవిడిపించుకొని ప్రయాణమయినాఁడు. కొంతదూరము పోయినతరువాత నాతని కొకమారు వెనుకకుఁ దిరిగి చూడవలయునని యనిపించినది. కాని తన కన్నీరు చూచినచో నామె మరింతగ నధైర్యపడునేమోయను భయముతో నాతఁడటులే యుద్ధక్షేత్రమునకు వెడలిపోయెను. ఆమె సాయంకాలపుఁ జీఁకటిలో నాతఁడు కనపడునంతవఱకును నటులే చూచుచు నిశ్చేతనమగు శిలాప్రతిమవలె నటులే నిలువఁబడి పోయెను.

## ౧౦

కళింగమల్లుఁడు తోసలీరాజ్యముపై దండెత్తనున్నాఁడను వార్త చెవులఁ బడగనే మహేంద్రకేసరి తనశక్తికొలదిగయుద్ధ

ప్రయత్నములన్నియుఁ జేసెను. తరువాత హేమనందిని బిలిచి యాతనితో నశోకచక్రవర్తి సాహాయ్యమునుగుటకై పోవలసిన దని చెప్పెను. అంతవఱకును నాతఁడు కళింగమల్లునితో విరోధమువచ్చునేమో యను భయముచేఁ గేవలమును దటస్థభావ మవలంబించియే యుండెను. కాని యింకఁ గళింగమల్లుఁడే కయ్యమునకై కాలుదువ్వినచో నతఁడేమి చేయఁగలఁడు? మొదటినుండియుఁ గళింగమల్లుని దుష్టబుద్ధి యాతఁడు గమనించుచునేయుండెను. అయినను నోపికపట్టెను. రాయబారము నకుఁబోవునపుడు హేమనంది చక్రవర్తితో నాగావళీవివాహ ప్రస్తావముకూడ నెత్తి యీసమయముననే వివాహముకూడ స్థిర పఱచిన బాగుండునని చెప్పెను. మహేంద్రకేసరి యీవిషయ మాలోచించినాఁడు. కాని చక్రవర్తి తనవంటిసామాన్య నృపాలుని తనయను వివాహమాడుట కిచ్ఛగించునా! మహేంద్రకేసరి కేమో యెంత మేరచూచినను నాశకనబడలేదు. కాని మంత్రితో యీవిషయమునఁగూడఁ బ్రయత్నింపవలసినదని చెప్పెను.

హేమనంది పాటలీపుత్రము చేరఁగానే సారంగపాణి దర్శనమర్థించి యాతనితోఁ దనవచ్చిన విషయమంతయుఁ బూసగ్రుచ్చినటుల చెప్పెను. సారంగపాణి చక్రవర్తితో నీ విషయము లాలోచించి సమాధానము చెప్పెదనని చెప్పెను. ఒకటి రెండు దినములవఱకును హేమనందికి సారంగపాణి దర్శనము కాలేదు. మూఁడవనాఁడాతనికిఁ గళింగమల్లుని సైన్యములు

తోసలీరాజ్యమునఁ బ్రవేశించినవనియు, యుద్ధము ఘోరముగ జరుగుచున్నదనియు వార్తలు వచ్చెను. అందుచే యాతఁడే సారంగపాణి దర్శనమునకుఁ బోయెను. సారంగపాణి యాతనిని సగౌరవముగ సుచితాసనమునఁ గూర్చుండఁ జేసెను. మొదట నొకనిమిషమువఱకును కుశలప్రశ్నాదికములైన తరువాత హేమనంది మెల్లగ నిట్లనియెను.

"సార్వభౌములతో సంప్రతించుమాట యేమైనది?"

"నాకింతవఱకును సార్వభౌములతో సంప్రతించుట కవకాశమే లభింపలేదు. నేఁడే నేను వారితో మాట్లాడితిని".

'మా విన్నప మేమైనది ?'

'సార్వభౌము లీదురాగతమునకుఁ జాల చింతించినారు. చక్రవర్తి వెంటనే తోసలీనగరరక్షణమునకుఁ బోవలసినదని సుందరగుప్తున కాజ్ఞాపించినారు. సుందరగుప్తుఁడు సైన్యాధిపతిగ లక్షలాదిగ సైన్య మీనాఁడే తోసలీరాజ్యమునకు బయలుదేర నున్నది!'

ఈమాటలువినుచున్న హేమనంది యానందమునకు మేరలేకపోయెను. ఆతఁడనేకవిధములఁ జక్రవర్తి యౌదార్యము ప్రశంసించుచు సారంగపాణి యీవిషయమునఁ జూపిన యాదరము వేనోళ్ళఁబొగడెను. కాని యతనికి నాగావళి వివాహ ప్రస్తావనపై చక్రవర్తి యేమన్నాఁడో తెలియలేదు. కొంత సేపటివఱకును సారంగపాణియె యీవిషయము ప్రస్తావించునని

యూరకున్నాఁడు. సారంగపాణి యీవిషయమే మాట్లాడక పోవుటచేఁ దానే ప్రస్తావింప నిశ్చయించినాఁడు.

"మరి రాజకుమార్తె వివాహముమాట యేమైనది? సార్వభౌముల యంగీకారము విని వివాహము స్థిరపఱచుటకై పురోహితులను బంపవలయునని యనుకొనుచున్నాము."

"సార్వభౌములతో నేనీవిషయముకూడఁ బ్రస్తావించితిని. వారు తోసలీరాజకన్యకను బెండ్లియాడుటకు సుముఖులుగనే యున్నారు. మీరిచ్చిన రాజకుమార్తె రూపచిత్రఫలకము చూచి వారెంతయుఁ బ్రసన్నులైనారు. రాజబంధువులుకూడ దీనికెంతేనిపరమానందభరితులైరి. కాని యొకవిషయమున్నది"

"ఏమది?"

"ఈయుద్ధము ముగిసి తోసలీరాజ్యము సురక్షితమగు నంతవఱకును వారు వివాహము స్థిరముచేయుట కిచ్ఛగింప కున్నారు."

"వారీవిషయమున సుముఖులుగ నుండుటయే మాకుఁ గావలసినది. మేమును వెంటనే వివాహమును స్థిరపఱచవలసిన యవసరము లేదనియే యనుకొనుచున్నాము."

"వారు సుముఖులుగనే యున్నారని చెప్పితినిగదా! కేవలమును నీయుద్ధ మగునంతవఱకును వేచియుండుట మంచిదని వారియూహ."

"అటులనే కావచ్చును" అని యాతనిదగ్గఱ సెలవు గైకొని హేమనంది తన నివాసభవనమునకు వచ్చివేసెను. హేమనందికి తాను వచ్చినపని యీవిధముగ సుముఖముగ ముగిసినందుల కెంతయో సంతసము కలిగినది. సార్వభౌములకు వివాహవిషయమునఁగూడ సుముఖత యున్నదన్నమాట మరింత యానందము గలిగించినది. ఇఁక తాను త్వరితముగఁ బోయి తన దేశీయులకు ధైర్యము చెప్పవచ్చును. తోసలీరాజ్య రక్షణమున కీవిధముగఁ జక్రవర్తి సహాయముచేయుట కంగీక రించుట నిజముగ దైవప్రేరితమే. ఆవిధముగ నాలోచించు చున్న యాతని కానాఁటిరాత్రి సుఖముగనిద్రపట్టెను. మరునాఁ డుదయముననే లేచి, యాతఁడు చక్రవర్తి సందర్శనముచేసి, మంత్రియగు సారంగపాణికడ సెలవుగైకొని, తన పరిజనముతో శీఘ్రముగఁ దోసలీనగరమునకుఁ బయనమైపోయెను.

ఆతఁడు తోసలీనగరమునకు వచ్చు మార్గములోనే కళింగమల్లుని సైన్యము లతివేగముగ రాజధానివైపునకు వచ్చుచున్నట్లు తెలిసెను. ఆవిషయములు వినుచున్నకొలఁ దియు నాతనికి గుండె లాగుచున్నటులు తోచెను. అయినను నాతఁ డశోకచక్రవర్తి సైన్యములు వచ్చి తమ్ము రక్షించునని దృఢముగ నమ్మెను.

ఆనాఁడు తన పరివారముతో నాతఁడతివేగముగ రాజ ధాని సమీపమునకు వచ్చుచుండెను. ఆతఁ డానాఁడశోక చక్ర

రంతయానమెక్కెను. చతురంతయాన మనగా నించుమించుగ నొక సవారీవంటిది. దానికి నాలుగువైపులును మూసికొనియె యుండును. అయినను లోపలనున్నవారు పైనున్న వస్తువులను, మనుష్యులను సులభముగఁ జూడవచ్చును. గాలిపోవుటకుఁ దానికిఁ జక్కని కిటికీలుండును. హేమనంది దానిలోఁ గూరు చుండి యప్పుడప్పు డింకను దోసలీనగర మెంతదూరమున్నదని బోయీల నడుగుచుండెను. అతని కారాత్రికే యెట్లైనఁ దోసలీనగరమునకుఁ బోవలెననియున్నది. అప్పుడే ఝాము రాత్రి దాటినది. నాఁడు బహుళదశమి యగుటచే వెన్నెల యాశ యేమియు లేదు. పదిమంది యాత్రికులు ముందును, పదిమంది వెనుకను గరవాలములు ధరించి వచ్చుచుండిరి. అట్లే పార్శ్వములయందుఁ గూడ పదిమంది యాత్రికుల చొప్పున నడచుచుండిరి. పదిమంది యా చతురంతయానము నకు బాగుగ ముందుఁబోవుచు మార్గము సురక్షితముగ నుండునట్లు చూచుకొనుచుండిరి.

ఆకాశమంతయు బాగుగఁ జీఁకటు లలముకొనెను. బాగుగ ముందుఁబోవుచున్న యాత్రికుల చేతులలోని కాగడాల వెలుగుబడిన చెట్లనీడలు తమ ప్రశాంతి కేదో భంగమయినట్లటు నిటు బరువెత్తుకొని పోవుచుండెను. చెట్లపై నచ్చటచ్చట మిణుగురుఁబురుగులు తమదారులు వెదకుకొను చుండెను. వర్షాకాల మగుటచే నాకాశమంతయు దట్టముగ

మేఘము లలముకొనెను. హేమనంది కారాత్రి యాసమీపమున నున్న యేపల్లెలోనో బసచేసి మరునాఁ డుదయమె బయలుదేరిపోయిన బాగుండునేమో యని యనిపించినది. కాని తాను తీసికొనిపోవు వార్త యత్యంతావశ్యకమగుటచేఁ దానేపోయి యీవార్త తన ప్రభువుతోఁ జెప్పి, యాతనితో సాధకబాధకములన్నియు నాలోచించి రాజ్యరక్షణమునకుఁ దగిన యేర్పాటు లన్నియుఁ జేయవలయునని తొందరపడు చుండెను. ఈకారణముననే యాతఁడు పదిరోజులలో ముగించ వలసిన ప్రయాణ మైదురోజులలో ముగింపఁదలపెట్టెను. ఇంకఁ దోసలీనగర మిచ్చటి కయిదారు క్రోశముల దూరముననే యున్నది. తోసలీనగర సమీపమున నొక చిట్టడవి యున్నది. అది దాటినచో నిఁకఁ దోసలీనగర మున్నమాటే.

ఇంతలో నొక్క సారిగ హాహాకారములు వినవచ్చెను. చూచుచుండగనే హాహాకారము లెక్కువయ్యెను. 'చంపుఁడు ! పొడువుఁడు ! కొట్టుఁడు !' అనుమాటలు వినవచ్చెను. హేమనంది యాశ్చర్యచకితుఁడై చతురంతయానములోనుండి తొంగి చూచెను. ఏదో కాగడాలసందడిలో నల్లకల్లోలముగా నున్నట్లు కనుపట్టెను. చూచుచుండఁగ గనులు మిరుమిట్లు గొలుపు నటులు కత్తులు తళతళ మెరయసాగెను. 'శత్రువులు ! పొడువుఁడు !' అను మాట లొకవైపునుండియు, 'పట్టుకొనుఁడు ! కట్టివేయుఁడు !' అనుమాట లొకవైపునుండియు వినవచ్చె

చుండెను. హేమనంది యిఁక నాలస్యముచేయుట మంచిది కాదని యొక్కసారిగఁ దన చతురంతయానమునుండి యిరికి ప్రక్కనున్న యొక యాశ్వికుని తన చతురంతయానమునకు రక్షకుఁడుగనుండ నియమించి యాతని యశ్వముపైకి లంఘించి తానుకూడఁ దలపడి పోరసాగెను. ఆ యంధకారములో శత్రు పక్షమువారెవరో తనవారెవరోకూడఁ దెలిసికొనుటకు వీలు లేనంత కల్లోలముగ నుండెను. మొట్టమొదట హేమనంది తమ్మెదిరించినవారు బందిపోటు దొంగలై యుందురని యనుకొనెను. అయినను నది రాజధానికి సమీపము. ఇది బాగుగ సురక్షితమైన ప్రదేశము. ఇక్కడ బందిపోటు దొంగలభయ మేమియులేదే! ఆతనికి వారెవ్వరో యని తర్కించుటకుఁ గూడఁ దగినంతగ నవకాశము లేకుండెను. అంతకంతకు శత్రుపక్షములోనివా రధికులై పోవుచున్నట్లు కనుపట్టెను. అయినను నాతఁడు ధైర్యమువహించి పోరాడుచునేయుండెను. కొంతసేపగునరి కాతని కిరువురు ముగ్వురు దన్ను చుట్టవేచి నట్లుల కానుపించెను. ఆతఁడు సహజముగ వృద్ధుఁడు. ఎంత నేర్పరియైనను నెంత హస్తలాఘవము కలవాఁడైనను నాతఁ డెట్లావిధముగ నిరువురు ముగ్వురితో పోరాడఁగలఁడు. అయినను నాతఁడు ధైర్యమువహించి పోరాడుచునేయుండెను. కాని క్రమక్రమముగ నాతని శరీరములో బలమంతయు సన్నగిలిపోవుచుండెను. కొంతసేపటి కాతనికి శత్రువులను జయించు ధైర్యముకూడ సన్నగిలిపోవుచుండెను.

చూచుచుండఁగ నెంతలోనెంత యుపద్రవము వచ్చినది. తాను శ్రమకోర్చి యెట్లో చక్రవర్తిసాహాయ్యము సంపాదింపఁ గలిగినాఁడు. చక్రవర్తిసైన్యములుకూడ రాజధానీ రక్షణమున కతివేగముగ వచ్చుచున్నవి. తాను తోసలీనగర మొకటి రెండు రోజులవఱకును శత్రువులబారిఁ బడకుండ రక్షింపఁగలిగి నచో నింక పూర్తిగ శత్రువులనుజయించినట్లే! ఎంతలోనెంతటి యుపద్రవము వచ్చినది! చక్రవర్తి సైన్యములు సహాయము చేయుటకు వచ్చుచున్నవను వార్తకూడ రాజధానికిఁ జేరు మార్గము లేకపోయినదే! శత్రువులు తోసలీనగర పరిసరము నకు వచ్చిరని తన కిదివఱకే తెలిసినది. బహుశః తమ్మెదిరించి నవి శత్రుసేనలే యైయుండును. సందేహములేదు. కళింగ మల్లునికి గూఢచారులవలనఁ దన ప్రయాణవృత్తాంతము తెలిసియుండును. అతఁడే దన మార్గమడ్డగింప వలసినదని కొంతమంది భటుల నీవిధముగఁ దనపైకి పంపియుండును. ఈవిధమగు నాలోచన లెన్నియో యాతని మనమున గిరగిరఁ దిరుగుచుండెను.

ఇంతలో బలమైన గాయమొకటి యాతని శిరస్సుపైఁ దగిలెను. ఆతఁడు శక్తికొలఁదిగఁ దన చేతిలోనున్న ఖడ్గముతో నెదుటివాని శిరస్సుపై నొక్కదెబ్బకొట్టెను. ఆదెబ్బతో నెదుటి వాఁడు చాపచుట్టగ నేలపైఁబడిపోయెను. అంతే! ఆపై నాతని కేమియు స్పృహలేదు! తానేదో పాతాళలోకమునఁ బడిపోవు చున్నట్లనిపించినది. ఆపడిపోవుట కంతమున్నట్లు కనఁబడలేదు.

ఆతని కదేవిధముగఁ బడిపోవుచున్నట్లనిపించినది. తానెక్కడనో పడిపోయినాఁడు! ఆ పడిపోయిన చోటొక బురదనేలవలెఁ గానుపించినది. తానేదో పెనురొంపిలో కూరుకొనిపోయినాఁడు. ఆపిమ్మట నాతని కేమి జరిగినదియుఁగూడఁ దెలియలేదు! ఒక మహాంధకారములో భయంకరమగు నొంటరితనము!

చైతన్యము వచ్చి చూచుసరి కాతఁ డొక గుడారమున నున్నాఁడు. చుట్టును నొక మహారణ్యమువలెనున్నది. అప్పుడే సూర్యోదయమైనటులున్నది. ఇంకను గొంచెము మసకమసక గనే యున్నది. ఆతఁడు బాగుగ కన్నులు తెరచిచూచెను. తన శయ్యకు చుట్టును విచ్చుకత్తులతో భటులు కాపలా గాయుచున్నారు. ఆచుట్టును గుఱ్ఱముల సకిలింపులును గజ బృంహితములును వినవచ్చుచున్నవి. అనతిదూరములోఁ దోసలీనగర ప్రాకారములు కానుపించుచున్నవి. అది కళింగ మల్లుని సేనాగారము. తానా సేనాగారములో నొకబందీ! ఎంతలో దురదృష్ట మెంతటిమార్పు తెచ్చినది.

## ౧౧

మహేంద్రకేసరి తన తనయునిచ్చుట కిష్టపడలేదని తెలిసి నప్పటినుండియుఁ గళింగమల్లున కొక్కసారిగఁ దోసలీనగరముపై విరుచుకొనిపడవలయు నను బుద్ధిపుట్టెను. అందుచే నాతఁడు

సైన్యమంతయు నతిరహస్యముగ నొక్కచోఁజేర్చి, హఠాత్తుగ నొకనాఁటి రేయి కోసలీ రాజ్యముపై దండెత్తెను. మహేంద్ర కేసరి చేతనైనంతవఱకును నాత్మరక్షణ మొనరించుకొనుటకుఁ బ్రయత్నించుచున్నాఁడని యనుకొన్నాము. కావున నాతనికున్న బలముతో నొక్కసారిగఁ గళింగమల్లుని బలముల నెదురుకొనెను.

ఆనాఁటికి, మంత్రిపోయిన పని తప్పకుండ సానుకూలపడుననియు నక్కారణమునఁ దానీయాపదనుండి సులభముగ నీవలఁ బడవచ్చుననియు ననిపించెను. కాని మంత్రివచ్చు దివసము దాటి యప్పుడే వారమురోజులైనది. ముందుగ సార్వభౌముఁడు తమకు సాయ మొనరింప నంగీకరించినాఁడనియు, సైన్యము లచిరకాలములోనే బయలుదేరి వచ్చుచున్నవనియుఁ గొంచెము సూచనగ మహేంద్ర కేసరికిఁ దెలిసినది. కాని వివరము లేవియుఁ దెలియలేదు. ఎంతకాలము తామీవిధముగ నిస్సహాయముగఁ బోరవలసియుండునోకూడఁ దెలియలేదు. ఎంతకాల మని యీనిరీక్షణము! మహేంద్ర కేసరికి మతిపోవుచున్నట్లుండెను. మరల సార్వభౌమునిదగ్గరకుఁ బోయి యమాత్యుని విషయమును, సార్వభౌముఁడు సహాయ మొనరించు విషయమును సవివరముగఁ గనుఁగొని రావలసినదని సత్వరాశ్వములపైఁ గొందరు దూతలనంపెను. ఎంతకాలము వేచిచూచినను మంత్రి తిరిగివచ్చు మార్గము కనపడలేదు. తుదకాతనికి మార్గమధ్యమున నేదైన నాపద వచ్చియుండవచ్చునని యొక గట్టి నమ్మకము కలిగినది. లేకపోయినచో మంత్రి యేమైయుండును!

ఆ నేళ సాయంకాల మాసన్నమైనది. ఆకసమంతయు మబ్బులు గ్రమ్మియుండెను. మహేంద్ర కేసరి యానాఁడు చాల నుత్కంఠతో నొక వార్తాహరునికొరకు ప్రతీక్షించుచుండెను. శత్రువు తోసలీనగరమునకుఁ జాలసమీపమునకు వచ్చినాఁడు. కాని యాతఁడెల్లు వచ్చులోపల నొకదుర్గమును జయింపవలసి యున్నది. ఆదుర్గము శత్రుదుర్భేద్యముగనుండునట్లు మహేంద్ర కేసరి చాలఁ గట్టుదిట్టము లొనర్చినాఁడు. ఈదుర్గము జయించుట చాలఁగష్టమనియు, దీనిజయించులోపలఁ జక్రవర్తి సేనలు తమ్ము రక్షింప రావచ్చుననియు నాతని యంధవిశ్వాసము.

ఇంతలో నొక యాశ్వికుఁడు ప్రాణావశిష్టమై రొజుకొను చున్న యశ్వముతో నచ్చటికివచ్చెను. వానిముఖమునఁ గత్తి నాటువేసినను నెత్తురులేదు. మహేంద్ర కేసరికి వానిని జూచునరికేదో యాపద మూడినదని యనిపించినది. అతనికొక నిమిషమువఱకును నోట మాటరాలేదు. అయినను ధైర్యము తెచ్చుకొని యిట్లన్నాఁడు.

"ఏమైనది?"

"విరూపాక్షదుర్గము కూడ శత్రువశమైపోయినదనియు, నిఁక రెండు మూఁడు యామములలో శత్రువు తోసలీ దుర్గము ముట్టడింప రావచ్చుననియుఁ దాము సకుటుంబముగ నెందైన దాగుకొనుట మంచిదనియు, సేనాధిపతుల నిశ్చితాభిప్రాయము. ననన్నివిషయము తమకు నివేదించుటకై యతి త్వరితముగ నిక్కడకుఁ బంపినారు"

"నన్ని నిస్సహాయులగు ప్రజలను విడిచి ప్రాణరక్షణ మొనరించుకొనుమందువా? నేనంత పందతన మవలంబింపలేను"

"దీనిలో పందతన మేమున్నది?"

"ప్రాణములకు వెరచి పారిపోవుట పందతనము కాదా"

"తమకనువగు సమయము వచ్చువరకును వేచియుండి శత్రువుపైఁబడుట క్షాత్రధర్మ విరుద్ధముగాదు. చక్రవర్తి సైన్యములు వచ్చువఱకును మీ రీవిధముగనే వేచియుందురుగాని యిందుల పారిపోవుట యేమున్నది! తమకు నేనివిషయములు బోధించుట కెంతవాఁడను! తాముమాత్ర మీవిషయ మెఱుఁగరా! ఆత్రమున నేనన్నమాటలు క్షమింప ప్రార్థన"

"సరేలే! నీవుపోయి విశ్రమింపుము!"

"కొన్నాళ్ళవఱకును దమరు జాగ్రత్తపడుట యత్యావశ్యకమని సేనాధిపతులు తమకుఁ బ్రత్యేకముగ......"

"సరేలే! నీవుపోయి విశ్రమింపుము,".

ఆ యాశ్వికుఁ డిఁక మాఱుమాటాడక వెడలిపోయెను. మహేంద్ర కేసరి ప్రాసాదోపరిభాగమునుండి కోటబురుజులవైపు నిరీక్షింపసాగెను. మబ్బులింకను దట్టముగనేయున్నవి. అయినను నామబ్బులలోనుండి చిన్నచిన్న నక్షత్రము లగపడుచునే యున్నవి. ఎక్కువగా ఉక్కపోయుచున్నది. ఆతఁడు దూరముగ శత్రుసైన్యములకును దమసైన్యములకును జరుగుచున్న పోరాటము చూచుచుండెను. తమసైనికులు తరంగ తరంగములవలె వచ్చుచున్న శత్రుసైనికులతోఁ బోరాడి యతిధైర్య

ముతో వారిని వెనుకకు నెట్టివేయుచున్నారు. కాని శత్రు బలము లమితములుగ నుండుటచే వారడుగడుగునకును ముందునకు వచ్చిపడుచుండిరి. క్రమముగ వారి కేకలకు చెవులుచిల్లులు పడుచున్నట్లుండెను. రాత్రియైనప్పుడు యుద్ధమాపివేయుట యార్యధర్మము. కాని కళింగమల్లుఁడీధర్మమునుసరింపక యన్యాయమునకుఁ బాల్పడి యీవిధముగ నొనరించుచుండుటచే మహేంద్రకేసరి కాత్మసంరక్షణార్థము యుద్ధముచేయక తప్పినది కాదు. చేసినమాత్ర మేమిలాభము! శత్రువుల సంఖ్యాబల మెక్కువ. ఏక్షణమునవయినను శత్రువులు తమవారి నోడించి, కోటతలుపులు బ్రద్దలుకొట్టి లోనఁ బ్రవేశింపవచ్చును. అందుచే ననుక్షణమును నాతఁడు వార్తాహరులకై నిరీక్షించుచుండెను.

ఇంతలో నాతని వెనుకనుండి మెల్లగ నడుగుల చప్పుడైనట్లుతోచెను. ఆతఁడు వెనుదిరిగిచూచెను. ఆమె నాగావళి! అతనికావిధముగ నచ్చటికి వచ్చుట యాశ్చర్య మయ్యెను.

"ఏమమ్మా! నీవిట్లు వచ్చితివి?"

"ఊరక మిమ్ముల నొకసారి చూడవలయునని—"

"అవును లే! ఇంత చీఁకటిలో వచ్చితి వేమి? ప్రమాదముకాదా?" యుద్ధరంగమునుండి యేబాణమైనను దూసుకొని వచ్చినచో?"

"మీకుమాత్ర మాభయము లేదా !"

"నాకుఁ గవచమున్నది."

"నేనును గవచము వేసికొనియే వచ్చితిని."

"అయిన నంత యవసర మేమివచ్చినది?"

"మీతో నొకమాట చెప్పవలయునని యనుకొనుచున్నాను"

"అటులనా!"

అని యాతఁడామెసన్నిధికేఁగి బుజముమీఁద చెయి వేసి బుజ్జగించుచు నిలువఁబడెను. ఆమె కొంతసేపటివఱకును నేమియు మాటలాడలేదు. ఏదో మాటలాడుటకు మాటలు తడుముకొనుచున్నదానివలె నిలువఁబడెను. మహేంద్రకేసరి "ఎందులకమ్మా! నీకింత సందేహము! నీమనస్సులో నున్నదేదో యున్నటులఁ జెప్పుము" అనెను.

"ఏమియునులేదు! కళింగమల్లుని కడకు రాయబారమంపుఁడు!"

"ఏమని"

"మనమాయన నియమము లంగీకరించుచున్నామని!"

"అట్లెన్నటికిని జరుగదు! నేను నాగొంతులోఁ బ్రాణమున్నంతవఱకును నాతని వివాహనియమమున కంగీకరింపను".

"అశేష ప్రజలీవిధముగ బాధపడుచుండ జూచుచు నూరకుండుట న్యాయమా?"

"ఎంతో కాలము బాధ పడనక్కరలేదు. చక్రవర్తి సైన్యములు రాజధానిలో నప్పుడే బయలుదేరినవఁట! మనకవి యింకఁ బది క్రోశముల దూరములో నున్నవి."

"అమాత్యులమాట యేమైనఁ దెలిసినదా?"

"తెలియలేదు"

"నేఁడో రేపో కోట శత్రువులకు లొంగిపోవునట్లున్నది. ఇఁకఁ జక్రవర్తి సైన్యములు వచ్చినమాత్ర మేమియుపయోగము!"

"కోట యంతశీఘ్రముగ శత్రువులకు లొంగదు"

"పోనీ కళింగమల్లునికి రాయబార మంపరాదా?"

ఈమాటలనుచుండ నామెకంఠమున గద్గదిక పొడమెను. ఆమె యేమో చెప్పఁబోయినది కాని మఱి యాపై నిఁక మాట్లాడలేదు.

'అమ్మా! నీవిఁక నీప్రస్తావము తెచ్చి నామనస్సునకుఁ గష్టము కలిగించకుము. అంతఃపురములోనికిఁ బోయి విశ్రమింపుము.'

ఈమాట లన్నతరువాత నాలుగైదు బాణములు రివ్వు రివ్వున నెగసి వారి కనతి దూరమునఁ బడెను. అదిచూచి మహేంద్రకేసరి "నీవింక లోనికేగుము. నేనొకమారు యుద్ధరంగము పరీక్షించి వచ్చెదను' అనెను.

నాగావళి చిత్రప్రతిమవలె నట్లే నిలువఁబడెను. మహేంద్రకేసరి మరల నామెను బుజ్జగించుచు 'నెందులకమ్మా! నీకింతభయము. చివరకన్నియు దిగ్విజయముగఁ గొనసాగిపోవును. దీనికి నీవేమియుఁ గళవళపడకుము' అనెను.

ఆమాటలపై నింకఁ జేయునది యేమియులేక నాగావళి మెల్లమెల్లగ లోనికేఁగెను. మహేంద్రకేసరికూడ సత్వరముగ

యుద్ధభూమిని బరీక్షించుటకై వెడలిపోయెను. నాగావళి లోపలి కేఁగుసరికి అంతఃపురమంతయు నీరవమై నిశ్శబ్దముగ నుండెను. స్త్రీలందఱును గుంపులు గుంపులుగఁ జేరి యేమేమో మాట లాడుకొనుచుండిరి. అందఱిముఖములును బ్రతిక్షణమును నేదో యొక భయంకరాపద యెదురుచూచుచున్నటులుండెను. ఆమె వైఖరిచూచిన యామె చెలికత్తె లిరువురికిని జాల విచారము గలిగెను. పాపము వారేమిచేయఁగలరు. ఆనందముగ జరిగి పోవలసిన వివాహ మీవిధముగఁ బరిణమించినది. ఏక్షణమున నేమి జరుగఁగలదో యెవ్వరేమి చెప్పఁగలరు! అయినను ధైర్య మవలంబించి వారనేకవిధముల నామెను వినోదింపఁజేయుటకై ప్రయత్నించుచుండిరి. ఆమె వారితోఁ బైపైకినవ్వుచు నేమియు విచారము లేనిదానివలె మాటలాడుచుండెను. కాని యామె హృదయమున నెట్టి విచార దావాగ్ని రగుల్కొనుచున్నదో యాచెలికత్తె లేమి గ్రహింపఁగలరు?

## ౧౨

ఎక్కడఁ జూచినను భయంకరమగు కోలాహలము! మహేంద్ర కేసరి సైన్యములు కోట పై భాగమునుండి కళింగ మల్లుని సైన్యములపై బాణవర్షము కురిపించుచున్నవి. కళింగ మల్లుని సైన్యములు సముద్ర తరంగములవలె నరకలు వేసి

కొనుచు వచ్చి కోట ముట్టడించుచుండెను. నాలుగైదు మదించిన గజములను గొనివచ్చి కళింగమల్లుని భటులు కోట సింహద్వార కవాటములు భేదించుటకై ప్రయత్నించు చుండిరి. ఒక్కొక్క దెబ్బకు ద్వారములు దద్దరిల్లిపోవుచుండెను. లోపల నున్నవారా కవాటములు బ్రద్దలైపోకుండ ననేక విధముల సంరక్షించు చుండిరి.

అప్పటికి మిట్టమధ్యాహ్న మయ్యెను. వర్షాకాలమైనను మబ్బులు పూర్తిగఁ దొలగిపోవుటచే నెండ తీక్ష్ణముగనుండెను. కళింగమల్లుని సైన్యములు నేల యీనినట్లసంఖ్యాకములై పోవుచుండెను. చివరకి నిరంతరముగ నేనుఁగులచే మోదించుటచేఁ గోటతలుపులు బ్రద్దలై విడిపోవఁజొచ్చెను. కళింగమల్లునిభటులు "హర! హర! మహాదేవ!" యని యఱచుచు నాకోటతలుపులపై విఱుచుకొని పడుచుండిరి. చివరకిఁ గొంతసేపటివఱకును గోటతలుపు లిటునటు లల్లలాడి, యొక్కసారిగ నేలపైఁ బడిపోయెను. ఆతలుపు వెనుకనున్న మహేంద్రకేసరి భటులలోఁ గొందరు దానిక్రిందఁబడి పిండి పిండిగ నలిగిపోయిరి. మఱికొందఱు వేలకొలఁదిగవచ్చి మీఁదఁబడుచున్న కళింగమల్లుని సైన్యములతోఁ బ్రాణములకుఁ దెగించి పోరాడుచుండిరి.

అప్పుడే సూర్యుఁడు కొంచెము పడమటిదెస కొరిగెను. అల్ప సంఖ్యాకులగు మహేంద్రకేసరి సైన్యము లెంతకాలము కళింగకేసరి సైన్యములతోఁ బోరాడఁగలవు? వారిలో నెప్పటి

కైన జయింపగలమను నాశలేకపోవుటచే ధైర్యోత్సాహములు సన్నగిలిపోవుచుండెను. చివరకు ధైర్యవంతులలోఁ గొందఱు తుదివఱకును నిలువఁబడి తమయసువులు గోల్పోయిరి. మిగిలిన వారు శరణాగతులైరి మహేంద్రకేసరి సైన్యాధ్యక్షుఁ డిఁక ననవసరముగఁ బ్రాణహాని యొందుటకని సైనికు లందరికిని లొంగిపోవలసినదని యాజ్ఞాపించెను.

క్షణములో మహేంద్రకేసరి రాజ్యమును గోటయుఁ గళింగ మల్లునికి స్వాధీనమైపోయెను. వెంటనే యాతఁడు మహేంద్రకేసరి కుటుంబముకొఱకును కోటయంతయు వెదకించెను కాని యెచ్చటనుగూడ వారి జాడయే కనఁబడలేదు! వారేమై పోయిరి? కళింగమల్లునికి జాల నాశ్చర్యకరముగఁ దోఁచెను. కోట చుట్టును దనసైన్యములు పది పదునేను రోజులనుండి ముట్టడించుచున్నవి. కోటలోపలినుండి యొక్క పురుషుడైన నీవలికి రాకుండఁ దనసైన్యములు కాపలా కాచినవి. కోట వెలుపలి నుండి యాహారపదార్థము లేమియు లోనికిఁ బోకపోవుటచేఁ గళింగమల్లుని కా కోటజయించుట చాల దేలికయయ్యెను. మరి మహేంద్రకేసరియు నాతని కుటుంబమును నేమైపోయిరి? బహుశః రహస్యముగ నే సొరంగమార్గమునైన నెక్కడి కైనఁ బారిపోయినారేమో!

ఈ యభిప్రాయము తట్టినప్పటినుండియు కోటలోని యన్ని మూలమూలల ద్వారములను రహస్యముగ వెతికించెను.

కాని యేమియుఁ బ్రయోజనము లేకపోయెను. చివరి కాతఁడు నిప్పులుత్రొక్కిన కోఁతివలెఁ దనలోఁ దానే మండిపడిపోసాగెను. కళింగమల్లుని యీధోరణిని చూచి యెవరును నాతనిని సమీపించుటకుఁ గూడ భయపడుచుండిరి.

కొంతసేపటి కాతనికెదురుగ నొకవృద్ధుని గొనితెచ్చి నిలువఁబెట్టిరి. ఆతనిధోరణిచూచినఁ జాలకాలమునుండి తిన్నగ నాతనికి నిద్రాహారములుకూడ లేనట్లు కనఁబడెను. వృద్ధుఁడగు నాతనిని జూచినతోడనే కళింగమల్లుని కెక్కడలేనికోపమును నొక్కసారిగఁ బైకుబికెను. ఆవృద్ధుఁ డక్లే చాలసేపటివఱకును నాతనియెదురుగ నిలువఁబడియుండెను. ఎంతసేపటికిని కళింగమల్లుఁడు మాట్లాడలేదు. ఆ వృద్ధునికి నిలువఁబడుటకుఁగూడ దగినశక్తి లేనట్లుండెను. అయినను యూపరివెల్లివలె రోజుచున్న యాతఁడక్లే నిలువఁబడియుండెను. ఆవృద్ధుఁడెవరో కాదు! మన హేమునంది! చివరకుఁ గళింగమల్లుఁ డాతనినిట్లు ప్రశ్నించెను.

"రాజకుటుంబ మిప్పు డెచ్చటనున్నది?"

"నాకేమియు తెలియదు!"

"మీకు తెలియును!"

"తెలియదన్నచో నామాటలకు విలువలేకపోయినచో నేనిఁక చెప్పవలసినది యేమియులేదు!"

అంతలోఁ గళింగమల్లుని కనుసన్న గ్రహించిన కొందఱు పరిచారకు లొక సుఖాసన మచ్చట నుంచిపోయిరి. కళింగమల్లుఁ

డాతని కా యాసనముచూపించి దానిపైఁ గూర్చుండుఁడనెను. మొదట మంత్రి యంతగా నిష్టపడలేదు, గాని కళింగమల్లుని బలవంతమువలన నాతనికి మరి మార్గాంతరము లేకపోయెను. ఆపైన మరలఁ గళింగమల్లుఁ డారంభించెను.

"హేమనంది! నేను చెప్పనదేదో సావధానముగ నాలకించి మరి యుత్తరముసెలవిండు! నాకు రాజకుటుంబమున కపకారముచేయు నభిప్రాయములేదు. ఇప్పటికైన మించిపోయిన దేమియులేదు! మీప్రభువుంశోకవర్ధనాది దాక్షిణాత్య ప్రభులందరికిని నేకీభావముగలిగించి యౌత్తరాహుల దండయాత్రనెదుర్కొనవలయునని చూచుచున్నాము. నాకు మహేంద్రకేసరి నిష్కారణవైర మవలంబించుట మిగుల బాధాకరముగనే యున్నది! అయినను నిప్పటికైన నాయనతో స్నేహమర్థించుచునే యున్నాను!"

"దానికి నేనేమిచేయఁగలను!"

"రాజకుటుంబ మెక్కడనున్నదో తెలుపవలయును."

"నన్ను మీరిక్ తోసలీనగరారణ్యముననే బంధించితిరి గదా! మరి నాకీవిషయమెట్లు తెలియును!"

"ఒకవేళ రాజకుటుంబ మెక్కడనున్నదియు మీకుఁ దెలియకపోయినఁ దెలియకపోవచ్చును. కాని వారేమార్గమునఁ బారిపోయినదియు మీరెఱిఁగియుండవచ్చును!"

"తమ యభిప్రాయమేమో నాకవగతమగుటలేదు."

"తెలియుట కేమికలదు! వా రేదో రహస్యద్వారము గుండ కోటదాటి పారిపోయియుండవచ్చును. మహామాత్యు లగుటచే వీరికి కోటలోని రహస్యమార్గములన్నియుఁ దెలిసి యుండవచ్చును. అదియే నే నడుగునది!"

"కోటలోనుండి యనేక రహస్యమార్గము లుండునన్న మాట నిజమే! కాని యవియన్నియు మాప్రభువు వారికిఁదప్ప నింకెవరికిని దెలియవు."

"నాకధికప్రస్తావనతోఁ బనిలేదు! మీకు తెలియునని నాకు తెలియును. వెంటనే యెఱిఁగించి మీప్రాణములు రక్షించు కొనుఁడు."

ఆమాటపై హేమనంది ముఖమున మందహాస ముద యించెను. అతఁ డొక నిమిషమల్లే కళింగమల్లునివైపుచూచి తీవ్రముగ 'మాప్రభువు ప్రాణములర్పించి నాప్రాణములు కాపాడుకొనవలెననియా! మీరు చెప్పునది' అనియెను. కళింగ మల్లుఁ డామాట కవహేళనగా నవ్వుచు "నేను చెప్పునది యద్ది కాదు! దీనివలన మీయిరువురి ప్రాణములనుగూడ కాపాడు కొనుమనియే!" అనియెను.

దానిపై హేమనంది 'నాకు తెలిసినను రహస్యమార్గము చెప్పను! ఇఁకఁ గేవలమును నావిషయము తెలియనివానిని బాధించినచో నేమిప్రయోజనమున్నది!" అనెను.

"అంతేనా?"

"అంతే!"

"బాగుగ నాలోచించుకొనుఁడు! ఆపిమ్మటఁ బశ్చాత్తాపము పడినచో నిఁకఁ బ్రయోజనము లేదు."

"అన్యాయమునకుఁ బశ్చాత్తాపముగాని, న్యాయమునకుఁ బశ్చాత్తాపపడవలసిన యవసర మేమున్నది!"

కళింగమల్లుఁడు 'అవునవును!' అనియెను. ఆతరువాత పార్శ్వముననున్న పరిచారకులతో 'ఈతఁడు రహస్యమార్గము చెప్పువఱకును గొఱత వేయుఁడు! రేపటియుదయములోపుగఁ జెప్పకపోయినచో నురితీయుఁడు!' అనియెను. వారు హేమనంది నచ్చటనుండి తీసికొనిపోయిరి.

## ౧౩

అది తోసలీనగరమున కనతిదూరముననున్న సాంద్రారణ్యము. ఆ యరణ్యమున ననేకములగు చిన్నచిన్న పర్వతములున్నవి. వానిపైఁగూడ చిక్కని యరణ్య మల్లుకొనియే యున్నది. అది తోసలీనగరాధిపులు సామాన్యముగ వేఁటాడు నరణ్యము. ఒకనాఁటి యుదయమున నాపరిసరమంతయుఁ గలకలలాడుచుండెను. ఒకయువతి పర్వతశిఖరముపై కెక్కి నిశ్శబ్ద

ముగ నేదియో పరిశీలించుచుండెను. ఆమెముఖమున దేనినో యెదురుచూచు నుత్కంఠ కనఁబడుచుండెను. ఆమె యెంత సేపటినుండియో అట్లే చూచుచున్నది. ఆమె యెవ్వరునుగాదు! వల్లకి!

"వల్లకీ! వల్లకీ! యెంతకాలమట్లు చూచెదవు. ఎవరైన నిది గమనించినచో మనకందరికిని గూడ ముప్పువచ్చును."

"భయములేదు! నేనెవరికిని గనఁబడకుండ జాగ్రత్తగనే చూచుచున్నాను."

"రా! యీపాటికి లోపలికి రా!" అని చెప్పి యీరెండవ యామె యామెను బలవంతముగ లోనికిఁ గొంపోయెను. వారిరువురును లోపల నొకచోఁ గూర్చుండి మాట్లాడుకొనుచుండిరి. ఆరెండవయామె వసుంధరణ.

కళింగమల్లునితో యుద్ధముచేసి జయించుట దుర్ఘటమని తేలిపోవగనే మహేంద్రకేసరి విశ్వాసపాత్రులగు పరిజనులతోడను, దనకుటుంబముతోడను గలిసి రహస్యద్వారముగుండ నీయరణ్యమున నొకగుప్తభవనమున నివసింపసాగెను. కోటలోనికిని యీభవనమునకును, నేడెనిమిది క్రోశముల దూరము వఱకును నొక సొరంగమార్గముగుండ దారియున్నది. ఇంక నొకటి రెండు రోజులలో కోట కళింగమల్లునికి స్వాధీనమయి పోవుననగానే యీతఁడు శీఘ్రముగ నాసొరంగమార్గముగుండ నాగుప్తభవనమునకువచ్చి, కోటలోనున్న కొందరు విశ్వాస

పాత్రులచే నెవ్వరికిని దెలియకుండ నాసొరంగమార్గముపూర్తిగ మూయించివేసి, అక్కడ నొకమార్గమున్నదను నానవాలు కూడ లేకుండఁ జేసివేయించెను.

మహేంద్రకేసరి నివసించుచున్న గుప్తభవనము చాల విచిత్రమైనది. అయ్యది యొక పర్వతము దొలిచి నిర్మించినది. కాని పైకది కేవలమును నొక పెద్దపర్వతమువలెఁ గనబడును. ఆపర్వతముపై నరణ్యముకూడ యథాప్రకారముగ నేయున్నది. సమీపముననుండి చూచువారికిఁగూడ నది సామాన్యమగు నరణ్యమువలెనే గన్పట్టుచుండును. అయ్యది మహాప్రాసాద మని చెప్పుటకు వీలులేదు గాని, రాజులకుఁ గావలసిన యన్ని యుపచారములకును ననువైన యొక చిన్న భవనము. అవసర మయినచో నాభవనమునుండి మరియొక భవనమునకుఁ బారి పోవుటకుఁగూడ వీలున్నది. దాని కనతిదూరమున మహేంద్ర కేసరికి విశ్వాసపాత్రులగు భటులు కాచియుండి శత్రువు లెవ రైన వచ్చుచున్నారేమో కనిపెట్టి చూచుచుందురు.

వల్లకి లోపలికి రాఁగానే వకుళాభరణయామె వైపుచూచి "ఎవరికొరకట్లు దేవనిగఁ జూచుచున్నావు?" అనియెను. దానిపై వల్లకి నవ్వుచు "నీకెందుకు నే నెవరికొరకో చూచుచున్నాను!" అనియెను. వకుళాభరణ యామెను సమీపించి మెల్లగనిట్లనెను.

"అంతకంతకట్లు మితిమీరిపోవుచున్నావేమే!"

"ఇందులో మితిమీరిపోవుట యేమున్నది!"

"ఎవరికొఱకంతయాత్రముగ( జూచుచున్నావు!"

"చెప్పుమందువా!"

"చెప్పుము!"

"ఈయరణ్యమున నొక గంధర్వకుమారు(డున్నా(డు!"

"చాలులే! నేర్చితివి!"

"నిజమే!"

"నిజము చెప్పెదవా! నిన్నొక మొట్టికాయ మొట్టుమందువా!"

"వలదు! వలదు! నిజము చెప్పెదను!"

"మరి శీఘ్రముగ( జెప్పుము!"

"చక్రవర్తి సైన్యములు పోవుదారి యిదియేగదా! అవి వచ్చుచున్నవో లేదో, చూచుచున్నాను!"

"నిన్నెవరు పంపిరి?"

"మహారాజులుంగారు!"

"అబద్ధము!"

"నిజమనే"

"ఇదిగో! మొట్టుచున్నాను! దీనితో సీతలపై పణము నూనె యింకును!"

"చెప్పెదను! చెప్పెదను! కొట్టకుము!"

"ఎవరు?"

"నాగావళి."

"నాగావళి యెక్కడనున్నది?"

"లోపల నున్నది!"

"అడుగుమందువా?"

"అడుగుము"

"అబద్ధమైనచో మొట్టికాయలు తిందువా?"

"ఆఁ!"

"నాగావళీ!"

"ఇదిగో వచ్చుచున్నాను!"

ఇంతలో చిక్కిన ముఖముతో నాగావళి యక్కడకు వచ్చెను. ఆమె వీరివైఖరిచూచి యొకింత యాశ్చర్యపడెను. వకుళాభరణ యాస్తే మొట్టికాయ మొట్టుటకు సిద్ధముగఁ జేయి నెత్తియుంచెను.

"ఎందుకే దానిని గొట్టుచున్నావు!"

"ఇది ఈయుధ్య నాఁడునవన్నియు నబద్ధములే!"

"ఏమన్నది?"

"నీవు చక్రవర్తి సైన్యములు వచ్చుచున్నవో లేవో చూడుమన్నావా?"

"ఉత్తది!"

దానితో వకుళాభరణ వల్లకి నొక మొట్టికాయ మొట్ట బోయెను. వల్లకి యామె రెండుచేతులనుబట్టుకొని బతిమాలుచు "కొట్టకుము! కొట్టకుము! ఉన్నమాట చెప్పెదను!" అనియెను.

"ఇప్పుడైన నిజము చెప్పకపోయినచో నిఁక నీమాట లేమియు నమ్మను!"

"ఇఁక నమ్మవద్దులే! నిజముగ నసలు జరిగినవిషయము చెప్పుచున్నాను! వినుము!"

"చెప్పుము!"

"చక్రవర్తి సైన్యములో మామేనత్తకొడుకొకఁడాశ్వికసైనికుఁడుగ నున్నాఁడు!"

"మీమేనత్త కొడుకా"

"ఒకవేలు విడిచిన మేనత్తకొడుకు!"

"అమగులో నే హంసపాదమా !"

"నన్ను పూర్తిగఁ జెప్పనీయనిచో నేనెట్లు చెప్పఁగలను!"

"సరేలే! చెప్పుము!"

"అతఁడు చక్రవర్తికొలువుచేరి యొక రెండేండ్లయినది ! చక్రవర్తిసైన్యము లిట్లుపోవునని తెలియుటచే నాతనినొకమారు చూడవచ్చునేమోయని యిట్లు నిలువఁబడితిని!"

"చక్రవర్తిసైన్యములు వచ్చునని నీకెవరు చెప్పిరి?"

"నాగావళి!"

"నాగావళీ, నిజమేనా?"

నాగావళి నవ్వుచు "నేను చెప్పలేదని యెన్నిమారులు చెప్పను!"

ఆమె వల్లికి మరలఁ బతిమాలుకొనుచుఁ "గాదు

కాదు. నాగావళియు మహారాజులుంగారును ననుకొనుచుండగా విన్నాను" అనెను.

"ఇదియు నబద్ధమే!" యని యామె వల్లకి నొక మొట్టి కాయ మొట్టెను. కాని వల్లకి యాదెబ్బ చటుక్కున దప్పించు కొని వకుళాభరణ చేయిపట్టు విడిపించుకొని దూరముగఁ బారి పోయెను. కాని మొట్టికాయ యామెపీపుపై మెల్లగఁదగిలినది!

వల్లకి యట్లు పారిపోయి తనకు వెనుకవైపుననున్న యరణ్యము తదేకధ్యానముతోఁ జూడసాగెను. క్రమక్రమముగ నామెముఖమున నాశ్చర్య మెక్కుడుకాసాఁగెను! దూరముగ నొక పెద్దగాలిదుమారము రేగినట్లు దుమ్ముపై కెగయుచుండెను! ఎట్టని ప్రాతఃకాలసూర్యకాంతి యాదుమ్ముపై బంగారుపూత పూసిన ట్లుండెను. అరణ్యమృగములన్నియు బెదరి యిటునటుఁ బరువెత్తు చప్పుడు దూరదూరమున వినవచ్చుచుండెను. ఆ ధూళిలో నెండినయాకులవలెఁ గాకు లెగురుచుఁ గావు కావని యఱచుచుండెను. అదిచూచి వల్లకి "వకుళా! శత్రువు లెవరో వచ్చుచున్నట్లున్నారు!" అనియెను. అది విని యాయువతు లందఱును నొక్కసారిగ నామెయున్నకడకుఁ బరువెత్తి యచ్చట నున్న గవాక్షముగుండ నాధూళివైపు చూడసాగిరి.

వల్లకి యన్నట్లుగ నేదో సేన వారివైపు వచ్చుచున్న మాటనిజమే. ఆసేన యొక మహానదీప్రవాహమువలెఁ గదలి వచ్చుచున్నది. కనుచూపుమేరలో నాసేన కెచటను నంత

మున్నట్లు కనఁబడుటలేదు. ముందు వేలకొలఁదిగ నేనుఁగులు నడగొండలవలె నడచివచ్చుచున్నవి. ఆవెనుక తరంగములవలెఁ దురంగసైన్యము లురకలు వేసికొనుచు వచ్చుచున్నవి. ఆవెనుక రథములవలెనున్న శకటములు ముత్యాల జాలరులతోఁ దళతళ లాడుచు వచ్చుచున్నవి. ఆవెనుక కనుచూపుమేరవఱకును నంతమే కనబడని యపారమగు పదాతిబలము ! ఆ ప్రాతఃకాల సూర్యకాంతిలో నాసైన్యములోని జెండాలన్నియుఁ దళతళ మెఱయుచున్నవి !

వకుళాభరణ దూరమున మైదానముగుండఁ దామున్న యరణ్యములోఁ బ్రవేశించుచున్న యాసైన్యముచూచి దిగాలు పడిపోయెను. వెంటనే వల్లకినిజూచి "వల్లకీ ! యీవిషయము శీఘ్రముగ మహారాజులుంగారి కెఱిఁగింపుము!" అనెను. వల్లకి మాఱుమాటాడక యీవిషయము మహారాజున కెఱిఁగించుటకై వెడలిపోయెను !

వకుళాభరణయు, నాగావళియు నాబలములవైపే పటులే చూడసాగిరి ! ఎంత అనంతమగు సేనాసముద్రము ! ఆసైన్య ములవైపు చూచుచున్నకొలఁదియు వకుళాభరణ శరీరములోజవ సత్త్వము లుడిగిపోవుచున్నటు లనిపించెను! అయినను గుండె ధైర్యముతో నటులే నిలువఁబడెను. క్రమముగ నాసైన్యము లురకలు వైచికొనుచు దగ్గఱకు వచ్చుచున్నవి ! ఎంత దుర్ దృష్టము! కళింగమల్లునిధాటికి కోర్వలేక పారిపోయివచ్చి చక్ర వర్తి సహాయమువచ్చునేమోయని యెదురుచూచుచున్న తమ

కెంతటి ముప్పువచ్చినది! దుర్వారమగు నీ యాపదనుండి తమ్ముద్ధరించువా రెవ్వరున్నారు?

ఇంతలో పల్లకి రోజుకొనుచు సచ్చటికి వచ్చెను. ఆమె యేమిచెప్పునోయని చెలికత్తెలిరువురు నఱచేతఁ బ్రాణములుంచుకొని కూరుచుండిరి. ఆమె యటులే నిలువఁబడియుండెను. నాగావళి రుద్ధకంఠముతో నేమియు మాట్లాడలేకపోయెను. వకుళాభరణ యెట్లో యూపిరితీసి "మహారాజుగా రేమన్నారే?" అనెను.

"చెప్పెదను! నాకే మిచ్చెదరు?"

"అబ్బ! వేళాకోళముల కేమి, చెప్పవే ప్రాణములుపోవుచున్నవి!"

"మంచిమాట చెప్పినచో నా కేమిచ్చెదరు?"

"మొట్టికాయలు" అన్నది వకుళాభరణ.

"కాదు! ముత్యాలహారము" అన్నది నాగావళి.

"అయినచోఁ జెప్పనా?"

"త్వరగాఁ జెప్పుము!"

"ఆ సేనలు కళింగమల్లునివి కానే కావట!"

"అయినచో నవి చక్రవర్తి సేనలా?"

"అవును!"

"నిజమే?"

"నిజమే!"

ఆమె చెప్పిన యీ మాటతో నా యిరువురును నొక్కసారిగ నామెను గాఁగిలించుకొని యొక్కసారిగఁ బైకెత్తివేసిరి.

'ఇదిగో నాబహుమానము' అని చెప్పి నాగావళి తనమెడలోని ముత్యాలహారముతీసి యామె మెడలో వైచినది. 'ఇదిగో నా బహుమానము' అని చెప్పుచు వకుళాభరణ యామెతలపై మొట్టికాయలు మొట్టసాగినది. వల్లకి యామెచేతులు పట్టుకొని 'వలదు! వలదు!' అని చెప్పుచు నక్కడనుండి యొక్కపరుగున లోనికిఁ బారిపోయినది. వకుళాభరణయు నాగావళియు నటులనే యామెను వెన్నంటి యామెతోఁగూడఁ దాముకూడ లోనికిఁ బరువెత్తిరి. ఆనాఁడా చెలికత్తెల యానందమునకు మేఱలేదు! వారిహృదయములో కారుమబ్బులు క్రమ్మిన యనంతరము తళతళ మెఱుపులు మెరిసినట్లయ్యెను.

## ౧౪

అశోకచక్రవర్తి హేమనంది వెనువెంటనే సైన్యములుతో పలీనగరమున కేగుట కుత్తరువిచ్చెను. ఆసైన్యములకు సుందరగుప్తుఁడు సైన్యాధిపతిగ నుండెను. చక్రవర్తికూడ స్వయముగ దండయాత్రకు వలయు నేర్పాటు లన్నియుఁ గావించెను. తనతోఁగూడ సారంగపాణినిఁగూడ రమ్మనియడిగెను. సారంగపాణి తానుగూడ వచ్చినచో రాజధానిలోనింక నెవరును నుండరని చక్రవర్తితోఁగూడఁ బోవుట కిష్టపడలేదు. కాని చక్రవర్తి యాతని నెట్లో యొడఁబఱిచి మంత్రి లేనపుడు రాజ్యరక్షణము

నకు వలయు నేర్పాటులన్నియుఁ గావించి తనతోఁగూడఁ దోడ్కొనిపోయెను.

చక్రవర్తికిఁ గళింగమల్లుఁడు దాక్షిణాత్య రాజన్యుల నందరిని గూడగట్టుకొని వచ్చుచున్నాఁడని తెలియును. అందుచే లక్షలకొలఁది కాల్బలమును దానికిఁదగిన గజాశ్వసైన్యమును రథసమూహమును వెంటఁబెట్టుకొని కళింగదేశ మణఁచివేయ వలయునని బయలుదేరెను. మార్గమధ్యమున నామహాసైన్య మంతయు నే విఘ్నములును నే యాపదలును లేకుండ సురక్షిత ముగనే వచ్చినది. సైన్యమంతయు మహానది కీవలనున్న యరణ్యా ములో సురక్షితముగ నుండునట్లు సేనా నివేశము లేర్పాటు చేసెను. ఆమహాసేనకెదురుగ మహానది నిశ్చల గంభీరముగఁ బ్రవహించుచున్నది. ఆనది కవతలివైపునఁ దోసలీనగరముకోట కనిపించుచున్నది.

చక్రవర్తి నేఁడో రేపో యనువగు సమయము చూచి మహానది దాఁటితోసలీనగరముపైఁ బడవలయునని చూచుచుం డెను. కళింగమల్లుఁడుకూడ సమస్తయుద్ధప్రయత్నములునొన రించి చక్రవర్తి దండయాత్ర నెదురుకొనుటకు సిద్ధముగనుండెను.

అప్పటికప్పుడే వర్షాకాలముచాలవఱకు వెనుకఁబట్టినదని చెప్పవచ్చును. కాని వర్షములింకను నప్పుడప్పుడు కురియుచునే యున్నవి. అందుచే సైన్యములకు మార్గమధ్యమునఁ గొన్ని చిన్నచిన్న యిబ్బందులు గలిగినను మొత్తముమీాద నిచ్చటికి సురక్షితముగనే చేరినవి.

చక్రవర్తి తన సేనానివేశములోనుండి యెదురుగ గంభీరముగఁ బ్రవహించు మహానదివైపును, నాపిమ్మట నవ్వలనున్న యా తోసలీనగరమువైపును జూచుచుండెను. ఇంక తెల్లవారనున్నది. తాను సైన్యములతో వచ్చి యిక్కడ సేనానివేశమేర్పాటుచేసి యప్పుడే యొకదినము కావచ్చెను. ఎక్కడను శత్రువుల యలికిడియే కనబడలేదు. శత్రువుల యభిప్రాయమేమైయుండును?

అప్పుడే యెఱ్ఱనివెలుగు లాకాశమునఁ గ్రమ్ముకొన్నవి. శత్రువుల పన్నాగము లేవో గమనించినఁగాని చక్రవర్తికి ముందుకు దూకుట యిష్టములేదు. ఇంతలో సుందరగుప్తుఁడును సారంగపాణియు వచ్చుటె కగుపించిరి. చక్రవర్తి వారివైపు 'విశేషములేమి!' అన్నట్లు చూచెను. సుందరగుప్తుఁ డేమియు మాట్లాడక వారిమాటలు వినుచుఁ గూరుచుండెను. చక్రవర్తి 'శత్రువుల పన్నాగమేమో తెలిసినదా?' అనెను.

"పన్నాగమున కేమున్నది! వారు కేవలము స్వరక్షణాపరులై యున్నారు!"

"అంతేనా?"

"అంతే".

"అయినచో వారి కాత్మరక్షణావకాశ మీయకుండ మనమే ముందుగ వారిపైఁబడిన మంచిది కాదా!"

"నాకట్లే తోఁచుచున్నది!"

ఇంతవఱకును మాట్లాడకూరకొన్న సుందరగుప్తు( డిక మాటలాడకూరకొనిన లాభములేదని 'మన మొకేచోట నదిని దాటుటకంటె దూర దూరభాగములలో( గొంచెము గొంచెము సైన్యముంచి నాలుగు ప్రదేశములలో దాటుటమంచిది' అనెను.

అట్లనుకొనుచుండ నొక్కసారిగ సైన్యములో నల్లకల్లో లము బయలుదేరెను. ఇంతలో నొకయాశ్వికు(డు పరువెత్తుకొని వచ్చి 'శత్రువులు నీటిలో మునిగి యీదుకొనివచ్చి, నది కివతల నున్న నావలనన్నింటిని ముంచివేయుటకు( బ్రయత్నించు చున్నారు!' అనెను. సారంగపాణి 'నీకెటులు తెలిసినది?' అని ప్రశ్నించెను. ఆయాశ్వికు(డు 'ఇరువది ముప్పదిమందిని మన సైనికులు పట్టుకొని బంధించినారు. ఆపై నింకను గొంతమంది, మనసేనలో రహస్యములు తెలిసికొనుటకు(గూడ( బ్రయత్నించు చున్నట్లగపడుచున్నది' అనెను.

చక్రివర్తికి నావలు ముంచివేయుటకై శత్రువులుచేయు చున్నప్రయత్నము చాల నపాయకరముగ( గన్పట్టెను. అందుచే నాత(డు సారంగపాణితో 'నింక మనమూరకొనుట యెంత మాత్రము మంచిదికాదు' అనెను. సారంగపాణి 'అవును! నేను వెంటనే సేనలకన్నింటికిని నదినిదాటి యుద్ధ మారంభించవలసిన దని యాజ్ఞాపించెదను' అనిపలికి యటనుండి వెడలిపోయెను. ప్రధాన సైన్యాధిపతియగు సుందరగుప్తు(డుకూడ( ద్వరత్వరగ నాతని వెనువెంట నడచిపోయెను.

చక్రవర్తి వారిరువురివైపును నట్లే చూచుచు నిలువఁబడెను. వారిరువురును వెడలిపోయిన తరువాత నొక యరగడియలో సైన్యములో నొక మహాసంచలనము! ఒక్కసారిగ గుఱ్ఱముల సకిలింపులు! ఏనుఁగుల ఘీంకారధ్వనులును మిన్నుముట్టెను. కాల్బలములన్నియుఁ గదలి యామహానదిని దాటుటకై పోవుచున్నవి. ఆసేనలు దాటుటకై వేలకొలఁదిగ నౌకలు సిద్ధముగ నుండెను. ఆసేనలు దాటుటకేమియు నంతరాయమున్నట్లగపడలేదు. కాని యాసేనలు దాటుటతోడనే చెవులు గింగురుమనునట్లు రణకోలాహలము బయలుదేరెను.

ఒక్కసారిగ లక్షలకొలఁది కాల్బలములును గజాశ్వసైన్యములును డీకొని ఘోరముగఁ బోరుచున్నవి! ఆపోరాటము చూచుచుండ నదియంతయు నాతనికి మహాభయంకరమగు నొక స్వప్నముగఁదోచెను. లక్షలాది మనుష్యులిట్లొకరినొకరు లక్షుఁ జంపుకొనుచున్నారు; వీరందరికిని నొక్కసారిగ మతిపోయినదా? లేక యీవిధముగ భావించుచున్న తనకే మతిపోయినదా? మహానది యావలితీరమునుండి భయంకరములగు ధ్వనులు వినవచ్చుచున్నవి. యుద్ధ మప్పుడే ప్రారంభమైనట్లు! ఆవిధముగఁ జక్రవర్తి చూచుచుండఁగనే జాము ప్రొద్దెక్కినట్లు కనఁబడెను. ఆవేళ నాకాశమంతయు నిర్మలముగానే యున్నది. క్రమముగఁ జక్రవర్తి సైన్యములు శత్రుసైన్యములో మున్ముందుకుఁబోవుచుఁ గోలగోడం కెగఁబ్రాకుచున్నవి. శత్రువులు పైకెగఁబ్రాకుచున్న యా సైనికులపై నెట్టగాఁ గ్రాగిన నూనె

రొయులకఁబోయుచున్నారు. అయినను శత్రువులు తదేకదీక్షతో కోటగోడలపై కెగఁబ్రాకుచునే యున్నారు. అదిచూచి చక్రవర్తి తానుగూడ వారిని ప్రోత్సహించుటకై బయలుదేరవలయునని యా సన్నాహములో నుండెను.

ఇంతలో నలుగురు భటులతో నొకవృద్ధుఁడు లోపలికి వచ్చెను. ఆతని ముఖములో రాజశ్రీవి గోచరించుచుండెను. ఆ నలుగురు భటులును నావృద్ధుఁడును లోపలికి రాఁగానే వెంట సారంగపాణి లోపలికి వచ్చెను. చక్రవర్తి యిదంతయు నేమని ప్రశ్నసూచకముగ సారంగపాణి నడిగెను. సారంగపాణి 'ఏమో! నాకును నిప్పుడే యీవిషయము తెలిసినది' అనియెను.

చక్రవర్తి యా వృద్ధునివైపు తిరిగెను! ఆ వృద్ధుఁడు "సార్వభౌమా! నేను తోసలీనగరాధీశ్వరుఁడను. తమదర్శనము కావలయునని కోరుచున్నను మీభటులు నామాటలు విశ్వసింపక నన్నీవిధముగఁ దమకడకుఁ దీసికొనివచ్చిరి" అనెను. వెంటనే సార్వభౌముఁడు మహేంద్రకేసరిని భటుల నిర్బంధము నుండి విముక్తునిజేసి రాజోచితమర్యాదలతోఁ దన సమీపమునఁ గూర్చుండఁబెట్టుకొనెను. ఆతఁడొకింత విశ్రమించిన తరువాత 'మీరిచ్చటి కెట్లు రాఁగలిగితిరి!' అనెను.

"కోట శత్రువుల వశమైపోవునన్నప్పుడు సొరంగ మార్గముగుండ నీయరణ్యమునకు వచ్చివేసితిని."

"మీ కుటుంబమంతయు సురక్షితముగనే యున్నారు గదా !"

"సార్వభౌముల కరుణవలన మేమంతయు సురక్షితముగనే యున్నాము."

"హేమనందిద్వారా మేము పంపిన వర్తమానము మీ కందినదా ?"

"లేదు !"

"హేమనంది శత్రుపక్షమునఁ జేరెనా ?"

"అతఁడట్టివాఁడు కాఁడు."

"మఱి యేమైయుండును ?"

"శత్రువు లాతని బంధించియుండుటగాని, వధించియుండుటగాని జరిగియుండవచ్చునని యనుకొనుచున్నాను."

"మీరువచ్చిన సారంగమార్గముగుండ మఱలఁ గోటలోనికేగుట కవకాశమున్నదా?"

"కొంచెము మేర త్రవ్వించిన లోపలి కేగవచ్చును !"

"మీకుటుంబ మెక్కడనున్నది ?"

"పర్వతము దొలిచి నిర్మించిన యొక పురాతన భవనమున నున్నది."

"ఇక్కడికి మీనివాస మెంతదూరమున నున్నది ?

"కనుచూపుమేరలో నున్నది !"

"మిమ్ముల నీభటు లీవిధముగ నిర్బంధించుటకుఁ గారణమేమి ?"

"నేను మీదర్శనము కావలయునని పట్టుపట్టితిని!"

"నాసైనికులతో మీ యథార్థవిషయము చెప్పకపోవుటలో నభిప్రాయమేమి ?"

"నా వేషమునుబట్టి నామాటలు విశ్వసింపరేమోయని భయపడితిని."

"వీరితో నేమని చెప్పిరి ?"

"నేను తోసలీనగరాధిపుని దగ్గరనుండి వచ్చితిననియు, నత్యవసరముగ మిమ్ములను దర్శింపవలయుననియుఁ జెప్పితిని."

చక్రవర్తి మరలఁ గొంత సేపటివఱకును నేమియు మాటలాడలేదు. ఆవిధముగనే కొంత సేపటివఱకును మాటలాడ కూరకుండి "మీరీవిధముగ నన్ను దర్శింపగలుగుట చాల మంచిదే యయినది! మీ గుప్తభవనము సంరక్షించుటకుఁ జాలినంత సైన్యము పంపించెదను. లేకపోయినను మీరు సపరివారముగ మా సేనానివేశమునకు వచ్చినను రావచ్చును. ఒకసారి మా సేనాధిపతికి మీ సొరంగమార్గము చూపింపఁగలరా?"

"అవశ్యముగ!"

"ఇప్పుడే పోవనక్కరలేదు! ఒకగడియ విశ్రమించిన తరువాత పోవచ్చును" అని పలికి చక్రవర్తి యభ్యంతర సేనానివేశమునకు వెడలిపోయెను. మహేంద్రకేసరి కీవిధముగ రక్షణ దొరకినందులకు లోలోపల మహానందమయ్యెను.

## ౧౫

ఒకవారము పదిరోజులవఱకును చక్రవర్తిసైన్యములకును కళింగమల్లుని సైన్యములకును భయంకరమైనయుద్ధముజరిగెను. ఆయుద్ధములోఁ గళింగమల్లుని సైన్యములేకాక చాలమంది దాక్షిణాత్య రాజన్యుల బలములుకూడ వచ్చిచేరినవి. దాక్షిణాత్య రాజన్యులందఱికిని గళింగమల్లుఁడీయుద్ధములో దక్షిణాపథము స్వతంత్రముగనుండుటో పరాధీనమగుటో తేలిపోవునని భయపెట్టెను. దానితోఁ జాలవఱకు దాక్షిణాత్యసేనలన్నియు నాతనికడ్డమై నిలబడెను. ఇరుసైన్యములును ప్రాణములకు తెగించి భయంకరముగఁ బోరాడుచుండెను. ఇరువురివైపునను వేలకొలఁదిగఁ బదాతిబలములును గజాశ్వసైన్యములును నాశనమైపోవుచుండెను. యుద్ధ మావిధముగఁ బదునేనుదినములు జరుగుసరికిఁ గళింగమల్లుని సైన్యములును నాతని యనుచరుల సైన్యములును నలసిపోవుచున్నట్లుగఁ గానుపించుచుండెను.

చివరికిఁ బదునారవనాఁడు చక్రవర్తి సైన్యముల స్వాయముగ నడిపించుచు శత్రువుల నెదుర్కొనెను. ఆతని పార్శ్వమున మహేంద్రకేసరికూడ వేరొక గజముపై నధిరోహించి విల్లమ్ములు చేతఁబూని యుద్ధమునకుఁ బయలుదేరెను. నాఁడు చక్రవర్తి మహేంద్రకేసరుల యుద్ధనైపుణి వర్ణనాతీతమని యందఱును మెచ్చుకొనిరి. మరల నాయుద్ధపు గందరగోళ

ములోఁ జక్రవర్తియు మహేంద్రకేసరియుఁ జెరియొకవైపున
కును విడిపోయి తీవ్రముగ యుద్ధము చేయసాగిరి.

సాయంకాలము కావచ్చినది. అప్పటికప్పుడే దాక్షిణాత్య సైన్యములలో నిఁక జయించుట కష్టమను నిరాశ బయలుదేరెను. వారిసైన్యములు పైకెంత భీకరముగఁ బోరాడుచున్నను జనజనలాడుచు జంకిపోవుచుండెను. యుద్ధము కొన్ని ముఖ్యములగు ధర్మనియమముల ననుసరించి నడపఁబడుచుండెను. అందుచేఁ జీఁకటిపడునంతనే యిరువాగులవారును యుద్ధరంగములో యుద్ధవిరామ సూచకములగు శంఖాదిధ్వనులచే యుద్ధమాపివేసి తమ తమ సేనానివేశములకు మరలిపోయిరి.

చక్రవర్తిసైన్యమున నెక్కువనష్టము కలుగలేదు. మఱునాఁటియుద్ధమున దాక్షిణాత్య బలములన్నియు జయించి, కోటలోఁ బ్రవేశింపవచ్చుననియు ననంతరము మహేంద్రకేసరికి మరలఁ బట్టముగట్టవచ్చుననియు నువ్విళ్ళూరుచుండెను. అంతలో నాతనికి మహేంద్రకేసరిమాట జ్ఞాపకమునకువచ్చినది. అన్నట్టు మహేంద్రకేసరి యేమైనాఁడు? యుద్ధములో నాతఁడును మహేంద్రకేసరియుఁ జెరియొకవైపునకును విడిపోయిన తరువాత మరలఁ గలిసికొనలేదు.

అందుచేఁ బ్రక్కనున్న పరిచారకు నొకనిని బిలిచి 'మహేంద్రకేసరి యెక్కడ?' అనెను. 'వారు యుద్ధమున తీవ్రాఘాతములుతగిలి సొమ్మసిలిపోయిరి. వెంటనే వారి కేయపాయమును గలుగకుండ గుడారమునకుఁ జేర్చితిమి' అనెను.

"నాకింతవఱకు నీవిషయమేల( దెలియ( జేయులేదు?"

"తమ విశ్రాంతికి భంగము కలుగునేమో యని భయ పడితిమి."

"శల్యవైద్యు లేమని యన్నారు?"

"శస్త్రఘాతములు చాల( దీవ్రముగా( దగిలినవని యన్నారు."

"శల్యవైద్యుల నిక్కడ కొకసారి పంపుము."

"చిత్తము."

చక్రవర్తి మనసున కీసంఘటన యొంతో యాఘాతము కలిగించినది! అయినను మహేంద్రకేసరికి( దగిలిన యాఘాతము లంతగా నాపత్కరములై యుండవని యాత( డనుకొనెను. ఇంతలో శల్యవైద్యు( డచ్చటికివచ్చి సవినయముగ( జక్రవర్తికి నమస్కరించెను.

"మహేంద్రకేసరి స్థితి యెట్లున్నది?"

"ప్రమాదకరముగనే యున్నది!"

"నాకింతవఱకును నీవిషయము తెలియలేదే!"

"ఇంతవఱకును నంతగ భయములేదనుకొన్నాము. కాని నేను వచ్చుముందు నాడి యేమియు బాగుగలేదు. అనుమతి యైనచో శీఘ్రముగ( దిరిగిపోయెదను."

"అటులనా?" అని చక్రవర్తి తానుగూడ వచ్చెద ననెను. ఇరువురును మహేంద్రకేసరి శయ్యాగారమున కేగిరి.

మహేంద్రకేసరి నిస్పృహుఁడై పడియుండెను. శల్యవైద్యుఁడు మఱల నొకసారి నాడిచూచి చక్రవర్తివైపు చూచి పెదవి విరిచెను. చక్రవర్తి యాతనివైపు నిశ్చలముగఁ జూడసాగెను. ఆవృద్ధుని వేదనలు తలఁచుకొనిన చక్రవర్తికిఁ గనులనుండి జొటజొట కన్నీరు ప్రవహింపసాగెను. అంతలో మహేంద్రకేసరి యొకసారి కనులు తెఱచి నలువైపులకును జూడసాగెను. చక్రవర్తిని జూడగనే యాతని కన్నులలో మెరుపులు మెరిసినట్లయ్యెను. బలహీనముగనున్న యాతనిహస్త మొక్కసారిగఁ జక్రవర్తిహస్తము పట్టుకొనెను. చక్రవర్తి సాదరముగ నాతని సరసను గూరుచుండెను. మహేంద్రకేసరి యాతనిని గన్నీళ్ళతో నిండిన కన్నులతో నొకసారిచూచి మెల్లఁగ నేదో చెప్పఁ బోయెను. చక్రవర్తి యది కనిపెట్టి యతని ముఖమునకు దగ్గఱగఁ జెవులుంచి వినసాగెను. మహేంద్రకేసరి యతికష్టముతో మాటలాడుచు మెల్లగ నిట్లనియెను.

"మీఋణ మెన్నిజన్మములెత్తినను దీర్చుకొనలేను. నాకింక జీవింతునను నాసలేదు. వృద్ధుఁడైన యీ సామంతుని ప్రార్థన మొక్కటి యంగీకరింపవలయును."

చక్రవర్తి యదివిని 'ఏమది?' అనునట్లు సంజ్ఞచేసెను. మఱల మహేంద్రకేసరి చెప్పనారంభించెను. 'మరియేమియు లేదు' మీరు కళింగమల్లుని జయింతురనుటలో నిఁక సందేహము లేదు. మీజయము నిశ్చయమే! నేను మీఋణమెట్లు తీర్చుకొనఁగలను? ఈ రాజ్యముతోఁ గూడ నాగావళిని స్వీకరించి

నచో నేను నిశ్చింతముగ మరణించెదను. నా కుటుంబరక్షణ మంతయు మీ హస్తమున నుంచుచున్నాను.

ఒకనిమిషమువఱకు జక్రవర్తి యేమియు మాటలాడ లేదు! కాని యిఁక నాలోచించుట కవకాశము లేదు. నిజముగఁ జక్రవర్తి యీవివాహమున కభిముఖుఁడుగనే యుండెను. కాని మహేంద్రకేసరిని మఱల సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టిన తరువాతఁ దాను తన సమ్మతి నెఱిఁగింపవచ్చునని యనుకొన్నాఁడు! సారంగపాణికూడ నిదియె యుచితముగ నుండునని తలఁచినాఁడు. కాని యది సాధ్యపడలేదు. ఏమైనను తా నీవిషయమున నంగీకార మీయఁగోరుటచే నిఁక నాలస్యము సముచితముగాదని యాతనికిఁ దనయంగీకార మెఱిఁగించెను! ఆ మాటపై నావృద్ధునికళ్ళలో నొకసారిగఁ గర్పూరనీరాజనము వెలిగినట్లయ్యెను. కాని యంతలోనే యాజ్యోతి సన్నగిలిపోవుచుండునటులు గానుపించెను. అందుచే నాతఁడు నాగావళీ తల్లికిని నాగావళికిని నతనిబంధువులకును శీఘ్రముగ వచ్చుటకి రావలసినదని కబురుపంపించి తన సేనానివేశమునకు వెడలిపోయెను.

అప్పుడు ఝామురాత్రి దాటినది. ఇఁక మహేంద్రకేసరి యొకగడియ రెండుగడియలకన్న నెక్కువకాలము బ్రదుకఁడని యాతఁ డనుకొనెను. కళింగవిజయమున యువకునివలెఁ బోరాడిన యావృద్ధునికిఁ మరలఁ దన రాజ్యమునఁ బ్రతిష్ఠింపఁబడు యోగము లేకపోయెనుగదా! యని యాతనికి విచారము గలిగెను. క్షణములో జీవితమును, నీభోగములును,

నీయుద్ధమును నతనికి బుద్ధప్రసాదములుగాఁ గానుపించెను. ఎన్నెన్ని వేలమంది సైనికులెంతసేపటిలోఁ మృత్తికలో గలిసి పోవుచున్నారు ! ఇంతకును నిన్నిలక్షలప్రాణులను సంహరించి నందులకుఁ బ్రతిఫలమేమి ? మహేంద్ర కేసరిని సంరక్షించుటా ? ఆవిషయమునఁ దానేమియు గృతకృత్యుఁడు కాలేకపోయెనే ! అటుఁ గళింగమల్లుని బలములన్నియుఁ జాలవఱకు నశించిపోయినవి. ఈవైపునఁ దన సైన్యమునకుఁ దగిలిన యాఘాతముకూడ సామాన్యమైనదికాదు. లక్షలాది ప్రాణు లీయుద్ధములో నాహుతియైపోయిరి ! దీనికి ఫలితము ! కళింగ మను నీరాజ్యమును జయించుట! అపారమగు నామృత్యుతాండవము దిలకించుచున్న యాతని కీకళింగవిజయ మొకభయంకర కిరాతకృత్యముగఁ గన్పట్టెను. ఇయ్యది కిరాతకృత్యముకంటెఁ గూడఁ బరమదారుణమైనది ! కిరాతుఁడు తనకుఁ గావలసిన యాహారము లభించినచో వేఁటమాని వెడలిపోవును ! అపారమగు నీ మనుష్యసంహారమునకును నా కిరాతకృత్యమునకు బోలిక యెక్కడిది ? ఆహా ! సర్వసంగపరిత్యాగ మొనర్చించి యరణ్యమున విశ్రమించిన శ్రమణకు లెంతటి ధన్యులు ! ఇట్లనుకొనుచుండ నాతని కా యరణ్యమున శ్రమణకులును శాంతిపూరితములగు వారిజీవితములును స్మరణకువచ్చెను ! వారిని దలఁచుకొనిన యుత్తరక్షణముననే యాతని ముఖము నుండి యొక వేడినిట్టూర్పువచ్చెను.

ఇంతలో నొకపరిచారకుఁ డరుదెంచి మహేంద్రకేసరి మరణ మెఱిఁగించెను. చక్రవర్తి మరల నొకనిట్టూర్పు విడిచెను. నిశ్చలముగ దేనినో చూచుచున్న ట్లొక నిమిషమువఱకును నుండి తరువాత నాతఁడు మహేంద్రకేసరి బంధువుల నోదార్చుటకై వారి సేనానివేశములవైపు వెడలెను.

## ౧౬

మహేంద్రకేసరి మరణానంతర మాతని సైనికులును, చక్రవర్తి సైనికులును, నతిభయంకరముగఁ బోరాడసాగిరి. కళింగమల్లుని సైనికులకుఁ దామింక జయించుట దుర్లభ మనిపించెను. అయినను వారు తోసలీనగరము కోటలోనుండుటచే. పై నున్న చక్రవర్తి సైనికులను జాలకాల మెదిరింపసాగిరి. కాని మహానదీప్రవాహములవలె పొంగిపొంగి వచ్చుచున్న చక్రవర్తి సైన్యములు పెద్దపెద్ద యినుపస్తంభములతో కోటతలుపులు ఛేదింపసాగెను. ఆనాఁటికిప్పటికే యుద్ధము ప్రారంభించి యిరువది దినములైనది. భయంకరములగు కోటతలుపులు బ్రద్దలుకొట్టుచున్న చక్రవర్తి సైన్యములు మరి గడియకో, అరగడియకో కోటతలుపులు విడిపోవచ్చునని యెదురుచూచుచుండెను. చక్రవర్తి యొక యేనుఁగుపై నధిష్ఠించి, వారందరిని త్వరితముగఁ బ్రోత్సహించుచు, ముందునకుఁ బోవుచుండెను.

అప్పటికి మిట్టమధ్యాహ్నమయ్యెను. మబ్బులు తెర తొలగించుటచే నెండ మిక్కిలి తీక్ష్ణముగ నుండెను. సైనికు లందరికిని నేక్షణముననే దమయుద్యమములు ఫలించి తమ కీర్తిను తప్పి పోవునో యని మిగుల నుత్కంఠగనుండెను. ఎండవేడిమి వలన బయలుదేఱిన నుక్క దుస్సహముగ నుండెను. సైనికులు మదించిన యేనుఁగులను గొనివచ్చి యదేపనిగఁ గోటతలు పులు క్రమ్మించిరి. మరలమరల నినుపకూటములతోఁ గోట తలుపులను మోదించిరి. ఒక్కసారిగ తలుపులు మొదలంట విరిగిన చప్పుడయ్యెను. ఫెళఫెళమని భయంకరముగఁ జప్పుడు చేయుచుఁ గోట తలుపులు వెనుకకుఁ బడిపోయెను. ఉరకలు వేయుచుఁ జక్రవర్తి సైన్యములు కోటలోఁ బ్రవేశించి శత్రువు లను దుర్మనియము లోనరింప మొదలు పెట్టెనవి. కళింగమల్లుఁ డిఁకఁ జేయునది యేమియులేక పరాజయసూచకముగను సంధిసూచకముగను నొక తెల్లని జండా యెత్తెను.

ఇరువాగులందును సైన్యములకు యుద్ధవిరామ శంఖ ములు పూరించిరి. చక్రవర్తి సైనికులు పరాజితులగు కళింగ మల్లుని, నాతనిప్రధానాధికారులను బంధించిరి. చక్రవర్తి నిరా ఘాటముగఁ గోటలోఁ బ్రవేశించెను. క్షణములోఁ దోసలీ రాజ్యమంతయు నాతనియాధీనమైపోయెను. తోసలీరాజ్యమేగాక కళింగమల్లుని రాజ్యములును నాతనిననుసరించివచ్చిన కొందఱు దాక్షిణాత్య రాజన్యుల రాజ్యములునుగూడ నాతని కైవశ మైపోయెను. కళింగమల్లుఁడు బందిగఁ గైకొనఁబడెను. మృతిపిసు

లతోఁగుళ్ళిపోయిన రణరంగమంతయు బరిశుద్ధముగ నొనరింపఁ బడెను. చక్రవర్తి యింకను నచ్చట వారము పది దినములుండి నూతనముగ జయించిన యారాజ్యమంతయు నొకదారిలోఁబెట్టి మరల రాజధానికి మరలిపోవలయునని యాలోచించుచుండెను.

కొలఁది దినములలో నూత్నముగ జయించిన తోసలీ పరిపాలనము దారిలోఁబడిపోయినది. ఇంకను నగరపరిసరముల నున్న కొంత రాజ్యపరిపాలన మొకదారిలోఁ బెట్టవలసియున్నది. అందుచేఁ జక్రవర్తి పరిసర ప్రాంతములకేగి యచ్చటి పరిపాలనము ధర్మబద్ధముగఁ జరుగుచున్నదియు లేనిదియుఁ బరిశీలించుచుండెను. అప్పుడప్పుడు మారువేషము వైచికొని సామాన్య పౌరునివలెఁ దిరుగుచు నగరవిషయము లరయుచుండుటకూడఁ జక్రవర్తి కలవాటు.

ఆనాఁడు కొంచెము చీఁకటిపడినతరువాత ఒక బైరాగి వేషమువైచికొని చక్రవర్తి నగరమంతయుఁ బరిశీలించుట కరిగెను. మొదట నాతఁడు రాజమార్గముగుండ మహాప్రాసాదము లున్న ప్రదేశములు దాఁటి చిన్నచిన్న వీథులలోనికిఁ బోయి యచ్చటఁ బ్రజలతోఁ గలిసిమెలిసి తిరిగెను. వారు తనరాజ్యమునుగూర్చియు, తన పరిపాలనమును గూర్చియుఁ జెప్పుకొను మాటలన్నియు సావధానముగవినెను. ఆపిమ్మట నాతఁడింకను సందుగొందులలోనికిఁ బోయి యచ్చటనున్న యనేకులగు కర్మకారుల వచనము లాలకించెను.

ఆపిమ్మటఁ గొంచెము రాత్రియైనదని తన పరిశీలన

ముగించి, తిరిగివచ్చుచుండ నొక పూరిగుడిసెలో నాతనికొక యేడుపు వినవచ్చెను. అది మిక్కిలి బలహీనముగ నున్నట్లు వినఁబడెను. అయినను నారోదనము వినువారి హృదయము తరిగివేయుచున్నట్లుండెను. చక్రవర్తి యా దీనాక్రందనమునకుఁ జకితుఁడై యచ్చటనే యొకకొంత సేపు నిలఁబడెను. ఆతరువాత నాతనికిఁ దెలియకుండగనే యాతనిపాదము లాతనిని మెల్లగ నాపూరిగుడిసెలోనికిఁ గొంపోయెను. అక్కడ నొకవృద్ధురాలు నేలపైఁబండుకొని యతి కరుణముగ నేడ్చుచుండెను. ఆమె వెనుక చెప్పిన యోధుని వృద్ధజనని! లోపల నొక సన్ననిదీపము వెలుగుచుండెను. నీడలన్నియు నిశ్శబ్దముగ నాదీపముచుట్టును జేరి యా దీనురాలి యతి కరుణరోదనము వినుచున్నట్లుండెను. చక్రవర్తి కొంత సేపచ్చట నిలఁబడి యామెదగ్గఱకేగి "ఎందుల కవ్వా! యేడ్చెదవు!" అనియెను. ఆమె యతని నొకసారి కన్నెత్తిచూచి మరింతబిగ్గరగ నేడువసాగెను. అట్లు కొంత సే పేడిచినతరువాతఁ జక్రవర్తి యనేకవిధముల నామెనోదార్చెను. ఆయవ్వ కొంత సేపటికి యేడుపు చాలించి యాతని ప్రశ్నలకు మెల్లగ సమాధానము చెప్పసాగెను.

"నాయనా! నాకుమారుఁడు తోసలీ సైన్యములో యోధుఁడు. ఆతఁ డీయుద్ధములో మరణించినాఁడు".

"అయ్యో! పాపము! నీకింక నెవరును లేరా?"

"నాకింక నెవరును లేరు" అని యామె మరల నేడువ నారంభించెను. మరలఁ జక్రవర్తి యడిగెను.

"నీవీవేళ భుజించితివా ?"

"లేదు"

అనగానే యాత్రి(డు ప్రక్కనున్న యొక విపణికిఁబోయి యామెకుఁ గొన్ని భక్ష్యములు గొనితెచ్చి యిచ్చి తినుమని బలవంతపెట్టెను. ఆమె యెట్టెట్లో గుక్కిళ్లనీరు గ్రుక్కుకొనుచు నవి భుజించి మెల్లగ నిట్లడిగెను.

"నాకీవిధముగ సాయముచేసిన మహానుభావు(డవు నీ వెవరవు నాయనా"

"నేనొక బౌద్ధభిక్షువును"

"అయ్యో! నేనే నీకు భిక్ష పెట్టవలసియుండ నీవే నాకు భిక్షము పెట్టుచున్నావే! ఎంత ధర్మాత్ము(డవు నాయనా!"

" నీవట్లనకుము ! ధర్మమార్గ మందరకును ననుసర ణీయమే" అని చెప్పి యాత్రి( డామెను మరల నోదార్చి తన దగ్గర దాచియుంచిన కొన్ని సువర్ణ నాణకముల నామెకిచ్చి, మెల్లగఁ దనభవనమునకు బయలుదేరి వచ్చుచుండెను. భవన మున కేగుచున్నంతసేపును నామె కరుణరోదన మాతని చెవు లలో గింగురుమని మారుమ్రోయుచున్నట్లే యుండెను. ఆ రోదనముం దాతనికి తన సామ్రాజ్యమును భాగ్యభోగ్యము లును, యౌవనమును సార్వభౌమత్వమును సమస్తమును మంచు వలె విడిపోవుచుఁ గరగిపోవుచున్నట్లుండెను. ఆదుఃఖము నన్న నన్నగఁ బైకి లేచుచుఁ దారకలను, నీలాకాశమును, గోళము లను సమస్తమును మ్రింగివేయుచున్నట్లు కన(బడెను.

చక్రవర్తి మారువేషముతో నప్పుడప్పు డాకుటీరము వైపు పోవుచుండెడివాఁడు. ఆమె యట్లే కరుణాక్రందనముతో నేడ్చుచుండెడిది. చక్రవర్తి యామెకెన్నో యుపశమన వాక్యములు పలికెడువాఁడు. ఆమె కొంచెము సేపూరకుండి మరల నట్లే యేడ్చుచుండెడిది. చక్రవర్తి తోసలీనగరమున నున్న పదునైదు దినములలోను పది దినములవఱకును బౌద్ధభిక్షుకుని వేషముతో నామెగృహమున కేగి, యామె నెన్నోవిధముల నోదార్చి వచ్చుచుండెడివాఁడు. ఆవృద్ధురాలి రోదన మాతనికి నిత్యమును నతిదీనముగ వినవచ్చుచున్నట్లే యుండెడిది. దాని వలన నాతని కేదో యనిర్వాచ్యమగు వేదన కలుగుచుండెడిది. తానుచేసిన యుద్ధమున కాతనికి గంభీరమగు పశ్చాత్తాపము గలిగెను. ఒకవృద్ధురాలిరోదనమె యింత హృదయవిదారకముగ నుండ నెన్నివేలమంది తల్లులును, భార్యలును, నక్కచెల్లెండ్రును నాతని యుద్ధమును, నతనిని శపించుచు నీవిధముగ నేడ్చుచుందురోగదా! వారందరికిని దానుచేసినయపకృతి తలంచుకొన్న ప్పుడాతనికి హృదయములోఁ గుంపటిపెట్టినట్లుండెడిది. అతఁడు తనకుఁ గలిగిన హృదయతాప మెవ్వరితోడను బంచుకొనలేదు. పాటలీపుత్రమునకు మరలిపోయినపిమ్మట నొకసారి శ్రమణాచార్యునిసన్నిధి కేగి ప్రశాంతమగు నాతనియాశ్రమమున గొంత కాలముండి శాంతముగ గడపవలయునని నిశ్చయించెను. అతనితోఁ దనకుఁగలిగినపరితాపమంతయు వెళ్ళఁబోసికొని యాతని యుపదేశములు వినుచుండవలయుననికూడ నాతని కనిపించెను.

౧౭

మహేంద్రకేసరి మరణానంతర మున్నవారిలోఁ బెద్ద కావున నాగావళికి రాజ్యము సంక్రమించెను. ఆమె యింకను చిన్నదియే యగుటచే మహేంద్రకేసరి భార్య మంత్రుల సాహాయ్యముతో నాగావళిపక్షమున రాజ్యమేలవలసినదని నిర్ణయింపఁబడెను. రాణి తనకుసంభవించిన యాపదకు లోలోపలఁ గుమిలిపోవుచున్నను నెట్లో తమ వంశీయులు తరతరములుగాఁ బరిపాలించురాజ్యము నిలబడినందులకును, నాగావళికిఁ జక్రవర్తివంటి యనురూపవరుని వివాహమాడు నదృష్టము గలుగఁ బోవుటచేతను గొంతవఱకూరటఁ జెందియుండెను. నాగావళికిఁ దండ్రివియోగము దుర్భరముగనుండెను. అయినను దాను దుఃఖించుచుఁ గూర్చుండినచోఁ దన చెల్లెండ్రికవుడును మరింత బెంగపెట్టుకొనిపోవుదురని యామె తనదుఃఖము లోలోపలనే యణచివేయుచుండెను. చక్రవర్తి తోసలీనగరమున నుండగనే మహేంద్రకేసరి తుదికోరిక ప్రకారము నాగావళిని జక్రవర్తికిచ్చి వివాహముచేయు సమయము నిశ్చయింపఁబడెను. అందుచేఁ జక్రవర్తి మరియొక పదునేనుదినములవఱకును తోసలీనగరమున నుండి నూత్నముగ జయించిన దాక్షిణాత్య రాజ్యవ్యవహారము లన్నియు నిష్కంటకములుగ నొనర్చి నాగావళిని వివాహమాడి రాజధానికి మరలిపోవలయునని నిశ్చయించెను. సారంగ

పాణి యీ వ్యవహారములన్నియు బాగుగఁ బరిష్కరింపఁబడి నందుల కెంతయు నంతసించి చక్రవర్తికడ సెలవు గైకొని సామ్రాజ్యవ్యవహారములు పర్యవేక్షణచేయుటకై చక్రవర్తికంటె జాలదినములు ముందుగనే పాటలీపుత్రమునకు మరలిపోయెను.

శుభముహూర్తము సమీపించుటచే నాగావళి చెల్లెం డ్రును జెలికత్తెలును నుత్కంఠతో నూగిపోవుచుండిరి. సరిగా ననుకొనిన శుభముహూర్తమునకు నాగావళికిని నశోకచక్రవర్తి కిని వివాహము జరిగిపోయినది. చూచువారందరికిని నావివాహ మన్నివిధముల మిగుల శోభాయమానముగ నుండెను. ఒక మహేంద్రకేసరిమరణ మావివాహానందమును వెన్నెలపై నొక నల్లని మేఘాచ్ఛాదనమువలె నుండెను. నాగావళి ముఖముపై చిరునవ్వుతక్క కలకలమనునవ్వు కానరాకుండెను. శుభసమయ మగుటచేఁ జెలికత్తెలును జెల్లెండ్రును నామె ననేకవిధముల నవ్వించుటకుఁ బ్రయత్నించుచుండిరి.

నాఁటిసాయంకాలము నాగావళియుఁ జెలికత్తెలును రాజ ప్రాసాదోపరిభాగమునఁ గూరుచుండియుండిరి. నాగావళి తనతలి దండ్రులతో నా నదీతీరమున విహరించిన సుఖదినములు సంస్మ రించుకొనుచుండెను. తన లోలోపల నావిషయము తలఁచు కొన్నప్పుడు దుఃఖము పొంగిపొంగి వచ్చుచున్నను నేమియుఁ జలింపనిదానివలెఁ బైఁబైకి చిఱునవ్వులు నవ్వుచుండెను.

వల్లకి:—నాగావళీ! నీ వెల్లుండి బయలుదేరి పాటలీపుత్ర మునకుఁ బోవుచున్నావుగదా! మమ్ముల నింకెప్పుడైన సంస్మ రింతువా ?

వకుళాభరణ:—చక్రవర్తిపత్ని సామాన్య సామంతుల తనూజలను గుర్తుంచుకొనునా ?

నాగావళి:—అదేమే! అట్లనుచున్నారు? నే ననలే బెంగ పెట్టుకొనియుండ మీరీవిధముగ మాట్లాడుట న్యాయముగ నున్నదా ?

వల్లకి:— సరి, అదేమే! మాతో బొత్తిగ మాట్లాడు టయే మానివేసినావు !

వకుళాభరణ:—పాపము! నాగావళి నిజముగఁ బెంగపెట్టు కొన్నదే! అందువలననే మనతో సంతగా మాట్లాడుటలేదు !

నాగావళి:— మీ రిరువురును నాతోవచ్చి కొంతకాల ముండిపోగూడదా ?

వల్లకి:— గట్టిదానవే! ఎవరైన విన్నచో నేమందురు?

నాగావళి:— ఇం దనుట కేమున్నది ?

వకుళాభరణ:— అదికాదే! మేము పెండ్లికానివారము గదా! నీతోవచ్చినచోఁ జూచువారికి బాగుండదు! పోనీ నీచెల్లెండ్రను నీతోఁగూడఁ దీసికొనిపోగూడదా ?

నాగావళి:— అట్లుపంపుట రాజమర్యాద కాదనియుఁ జిన్నప్పటినుండియు నన్ను బెంచిన దాదిని, మరికొందరు పరిచా రికలను వెంటపంపెదననియు నమ్మ యనుచున్నది !

వకుళాభరణ:— చూచితివా మరి! మేముకూడ వచ్చిన బాగుండదు! మాకుమాత్రము రావలెననియుండదా? ఏమి చేయుము! మన రాజవంశముల మర్యాద లట్లున్నవి!

వల్లకి:—పోనీ! నీ వొకటిరెండు నెలలుండి యొకమారు తోసలికి రా(గూడదా ?

నాగావళి:— అటులే వచ్చెదను – కాని యెంతోకాల ముండుటకు వీలుండదేమో !

వల్లకి:—(నవ్వుచు) భయములేదు! పరమేశ్వరుని దయ యుండినచో నయినారు నెలలవఱకు నుండు నవకాశము లభింపవచ్చునులే ?

నాగా:—ఎట్లువీలగును! నాకదియేమో బోధపడుటలేదు!

వకుళాభరణ:— వల్లకి పరిహాసము నీకింకను బోధపడు నట్లు కనఁబడదు !

నాగా:— వల్లకి యూరక యిట్లెందుకు నవ్వుచున్నదో నాకు బోధపడుటలేదు !

వకుళాభరణ:—అదికాదు ! భగవంతుని దయవలన నీ కడుపున నొక కాయకాచినచో పురిటికని పుట్టింటికిరావా ?

నాగా:— 'వల్లకి యెప్పుడును నిట్టివేళాకోళములే!' యని యామెను బట్టుకొని మొట్టికాయలు మొట్టఁబోయెను! కాని వల్లకి యొక్కలగువులోఁ దప్పించుకొని క్రిందకుఁ బారిపోయెను. నాగావళి యామెను దరుముచుఁ బరువెత్తుకొనిపోయెను. వకుళాభరణ వారిని విడిపించుటకై తానుగూడ వెంటనంటిపోయెను.

## ౧౮

చక్రవర్తి నాగావళితోఁ గలిసి రాజధాని కేగిన తరువాతఁ గొంత కాలము చాలసుఖముగఁ గడిపివేసెను. కాని యాతని కండ్ల కెదురుగ నాభయంకరయుద్ధము, భటులకోలాహలము, ఆక్రందనములు మొదలగునవన్నియుఁ గన్నులకు గట్టినట్లుండెడివి. ఆ వృద్ధురాలి యాక్రందనముగూడ నన్నని భయంకర వర్షధ్వనివలె నాతనిహృదయముఁ గలఁచివేయుచుండెను. క్రమముగ చక్రవర్తి హృదయములో నేదో బరువుంచినట్లయ్యెను. ఆభారమువలన నాతఁడు క్రమక్రమముగ శుష్కించిపోసాగెను. సారంగపాణికూడ నాతని హృదయవేదన గమనింపలేకపోయెను. నాగావళికూడ నాతని సన్నిధిని గ్రమముగఁ దనదుఃఖములన్నియు మరచిపోఁగలిగెను. చక్రవర్తికిమాత్ర మది యసాధ్యమై పోయెను. ఒకనాఁ డాతఁడు కొలఁదిమంది యనుచరులతోడను, సుందరగుప్తునితోడను గలిసి వేఁటకని బయలుదేరి యరణ్యములో బౌద్ధవిహారములోని కేగెను. విహారద్వారప్రాంతమున నాతని యనుచరులును గాపుండిరి. చక్రవర్తి సామాన్యవేషముతో లోని కేగెను. శ్రమణక దేవుఁడు ప్రశాంతదృక్కులతోఁ బ్రాతః కాల సౌందర్యశోభ నిరీక్షించుచునట్లు గూరుచుండెను. చక్రవర్తినిజూచి సమీపమునకువచ్చి కూర్చుండుమని సంజ్ఞచేసెను. చాలసేపటివఱకును చక్రవర్తియు ఆచార్య దేవుఁడును నేమియు మాటలాడలేదు; గాని తుదకుఁ చక్రవర్తియే యుద్ధాదివిషయ

ములును, వృద్ధురాలి శోకవిషయమును బూసగ్రుచ్చిన ట్లాతనికిఁ జెప్పెను. ఆచార్యదేవుఁడు కొంతసేపటివఱకును నేమియు మాటలాడలేదు! చివరకు 'ఊపిరిబిగబట్టి యొడలు తెలియకుండఁ బరువెత్తుచున్నంతకాలమును బ్రశాంతముగ నిద్రించువాని సౌఖ్య మెచ్చటినుండి వచ్చును?" అనియెను.

"ఎవరు పరుగెత్తుచున్నారు! ప్రభూ!"

"మీరందరును".

"వేనివెంట"

"భోగములవెంట – సుఖములవెంట – ఇవి కేవలమును శారీరికసుఖములే కావు! మానసికముగానున్న సుఖములుగూడ నున్నవి. శారీరికసుఖములను జయించుట కొంతవఱకు సాధ్యమేగాని, మానసికసుఖములు జయించుట సాధ్యముగాదు".

"ఎందుచేత నిది యంత కష్టసాధ్యమైనది?"

"మానసిక సుఖములను జయింపవలెనని బయలుదేరుటలోఁగూడ నొక సుఖాభిలాష లేదా?"

"అవునవును!......ఆమాటలో నెంతో గంభీరసత్య మున్నది!"

"నా రాజ్య మప్రతిహతముగ నుండవలెను. నన్నేకచ్ఛత్రాధిపతి యని పిలువవలెను!" అను నీ కోరికలేగదా లక్షలాది మానవులను సంహరించుటకుఁ గారణములు!

చక్రవర్తి మాటాడలేదు.

"ఆకారణముచేత నేఁగదా ప్రజలను బరిపాలింపవలసిన రాజులు ప్రజానాశకులగుచున్నారు!"

ఈ విధముగ శ్రమణక దేవునితోఁ జక్రవర్తి చాలసేపటి వరకును జర్చించెను. ఆపిమ్మట నట్లే యింకను గొన్నిదినములు శ్రమణక దేవునితో ననేకవిషయములు చర్చించెను. ఆచర్చల కంటె నా ప్రశాంతజీవితమును, కరుణాళువగు నా బౌద్ధాచార్యుని సౌమ్యవీక్షణములును చక్రవర్తి కెంతో మానసశాంతి చేకూర్చెను. క్రమముగఁ జక్రవర్తి యనవసరముగ వేఁట కేగుట మొదలగు హింసాకృత్యములు మానివేసెను. అట్లు కొంత కాలము గడచినతరువాత క్రమముగ మాంసాహారముగూడ మానివేసెను. ఈవిధముగ గొంతకాలము గడచిన తరువాత శ్రమణకాచార్యుఁ డాతనికి బౌద్ధధర్మదీక్ష నొసఁగెను. క్రమముగ నాగావళికూడ భర్తవలెనే బౌద్ధధర్మము స్వీకరించెను.

అప్పటినుండియుఁ జక్రవర్తి ప్రవర్తనమే మారిపోయెను. ప్రజలందరిని దినదినమును గంటికి రెప్పవలెఁ గాపాడుటయే యాతని నిత్యకృత్యముగ మారిపోయెను. పశుహింస మానిపించి వానికిఁగూడ వైద్యశాల లేర్పాటుచేయించెను. తాను బౌద్ధుఁడయ్యును నన్నిమతములవారిని సమానముగ నాదరించెను. పెద్దలయెడల గౌరవభావముతో మెలఁగవలయునని నియమించెను. కేవల మిట్లు నియమించుటయేగాక తానుగూడ స్వయముగ వాని నాచరించుటచే సామ్రాజ్యములో నన్నిచోటులను జక్రవర్తియాజ్ఞ శిరసాహింపఁబడెను.

చక్రవర్తి క్రమముగ దండయాత్రలు మానివేసెను. కేవలమును నత్యవసర సమయములం దాత్మరక్షణము కొరకే సైన్యములుంచెను. ప్రజలందరిని దన కన్నబిడ్డలవలెఁ జూచుకొనుటచే నిజముగ నాతని దశోకరాజ్యమయ్యెను.

ఈవిధముగ శాసనము నొనరించుటయేగాక యీవిధముగు ధర్మనిబంధనము లన్నియుఁ జక్కని శిలాస్తంభముల మీఁదఁ జెక్కించి సామ్రాజ్యమం దంతటను నా స్తంభమును స్థాపించెను. రామరాజ్యము తరువాత నశోకుని రాజ్యమంత ధర్మబద్ధమైన రాజ్యము మరియేదియు లేదని చెప్పెదరు! గొప్ప గొప్ప చరిత్రకారులందఱును అశోకునివంటి ధర్మాత్ముఁడగు చక్రవర్తి మరి యెవ్వరును లేరనియుందురు.

భారతదేశమున ననేక సామ్రాజ్యములు మొలకెత్తి, సంపూర్ణముగ నశించిపోయినవి. వానిలోఁ జాలవానికి నే డేవిధమైన యానవాలుఁ గన్పట్టదు. అశోకునిసామ్రాజ్య మంతరించినది! కాని యాధర్మప్రభువు మన దేశమునఁ బాతించిన శిలాస్తంభము లింకను నక్కడక్కడఁ జెక్కుచెదరక నిలిచియున్నవి. వానిమీఁద నామహామహుని ధర్మశాసనము లిప్పటికిని జదువవచ్చును. ఆశాసనములలో నేఁటికిని కరుణామూర్తియగు నా చక్రవర్తి దయార్ద్రహృదయము కనుపించుచునే యుండును. ధర్మాత్ముఁడగు నంతటి మహామహునిగన్న యీ భారతదేశమునఁ బ్రత్యణువును నతిపవిత్రమైన దనుట యతిశయోక్తి కాదు!

రాయల ముద్రణాలయము, తణుకు — జూలై 1952.

ROWTHU SERIES

# NOTES AND EXAMINERS.

**Ready New Model Telugu Notes & Examiner on Detailed Telugu Text and four non-detailed texts**

**for**

**S. S L. C. Public Examination 1953.**

**by**

**Well known and Experienced Pandit Sri Varanasi Gangadhara Sastri garu, Senior Telugu Pandit Board High School - Kovvur,**

Containing with more important topics to guide the students appearing for 1953 Examinations. Questions and answers, allusions, various Grammar topics, translation and general essay exercises etc. Sure and guaranteed success to followers of these series

Price Rs. 3—8—0.

2. "Adarsha Vyasa Manjari" in Telugu by Sri Vidwan Musunuri Venkata Sastry Price Rs. 1—8—0

SOCIAL STUDIES

3. Specimen Question Paper issued by the Secretary Secondary Education Board, Madras, with Answers. (For V and VI Form) by Sri K. V. Desikachary, M. A., B. Ed. 2 0 0

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 4. | do | For | VI Form | 1 | 4 | 0 |
| 5. | do | For | V Form | 1 | 0 | 0 |
| 6. | do | For | IV Form | 0 | 12 | 0 |
| 7. | do | For | III Form | 0 | 10 | 0 |
| 8. | do | For | II Form | 0 | 9 | 0 |
| 9. | do | For | I Form | 0 | 8 | 0 |

**ROWTHU BOOK DEPOT, RAJAHMUNDRY.**

Royal Printing works, Tanuku.

